# గుడివాడ సర్వస్వము

[మొదటి భాగము]





గ్రంథకర్త:

కోగంటి దుర్గామల్లికార్జునరావు

భారతీ సమితి.

శ్రీరస్తు - శుభమస్తు　　　　　　　　నూజివీడు

6-2-1945

మహారాజశ్రీ, ...., ఉభయ భాషా ప్రవీణ, కోగంటి దుర్గా మల్లికార్జున రావు గారికి, మల్లాది సత్యనారాయణశాస్త్రి ఆశీస్సుల నొసగి వ్రాయు సంగతులు

అయ్యా! తమ "ఆర్యశతకము"ను ఆమూలాగ్రముగఁ జదివి యానందించితిని. అది ప్రస్తుత కాలపరిస్థితుల కనుకూలము. హృదయంగమము. సుప్రసిద్ధమగును గాక. ఉభయ భాషాప్రవీణ, మల్లాది సత్యనారాయణశాస్త్రి, సంస్కృతోపాధ్యాయుడు, యస్. ఆర్. ఆర్. హైస్కూలు, నూజివీడు.

---

ఆర్యా!

మీరు గౌరవాదరములతో నా కంపిన మీ "ఆర్యశతకము" నామూలాగ్రముగఁ జదివితిని. ఇందవఱకు నేను చదివిన శతకములలో నాకట్టిది కానరాలేదు. భాష యందును భావముల యందును, శతక లక్ష్యము నందును నొక విధముగు ప్రత్యేకత దీని యందు నాకు గోచరించుచున్నది. ఇది కేవలము సామాన్య జనుల కందు బాటులో నుండి "సుమతీ శతకము, వేమన శతకము" మున్నగు వానియందలి పద్యముల వలె సులభముగా నోటికి పట్టునదునవిగా నుండుట దీనికొక గుణము. కేవల సామాన్యులకే గాక సర్వ జనాహ్లాద కరమగు నటుల ఇతోధిక గ్రంథ రచన చేసి కీర్తి గాంతురు గాక యని ఆశించుచున్నాను. ఇట్లు, భారతీ పద పద్మారాధకుడు. అద్దేపల్లి లక్ష్మణస్వామి బి. ఏ బిఇడి హైందవోన్నత పాఠశాల, బందరు, 20-9-45

శ్రీ విఘ్నేశ్వర గ్రంథమాల

# గుడివాడ సర్వస్వము

[మొదటి భాగము]

గ్రంథకర్త

మల్లికార్జున కవులలో ప్రథముడును, తిరుపతి వేంకట కవుల
ప్రశిష్యుడును, రిటైర్డు ఫస్టుగ్రేడ్ తెలుగు పండితుడును,
శతాధిక గ్రంథకర్తయునగు బాలకవి, కవిమిత్ర, కవితా
భూషణ, కవికోకిల, మధురకవి, ఆంధ్ర వాఙ్మయా
లంకార, సన్మాన సమ్రాట్, విద్వాన్
ఉభయ భాషా ప్రవీణ,

## కోగంటి దుర్గామల్లికార్జునరాయకవి

భారతీ సమితి, పామర్రు, కృష్ణాజిల్లా

పామర్రు 5-5-72 } అన్ని హక్కులు గ్రంథకర్తవి
మొదటికూర్పు 1000 ప్రతులు } వెల : రూ 2-00

చూడగవలదన్న విడువక చూచుచుంటి
నొంపవలదన్న విడువక గలుపుచుంటి
వ్రాయవలదన్న విడువక వ్రాయుచుంటి
భారతీదేవి పాదాలను వదలకుంటి॥

పాఠక మహాశయులారా! చరిత్రలు పెక్కు రకములు. చరిత్రలు పెక్కుగా నున్న కాలంబున చరిత్ర గ్రంథసంగ్రహంబులు యుక్తమంబులు కార్యంబని మదీయ చిత్తంబున నెన్నడో వ్యాప్తియుండెను. కాని చరిత్రయందు విపులముగా రచించుట కవకాశము లేదను విషయంబును గ్రహించి సర్వస్వములను వ్రాయుటకు నిశ్చయించుకొంటిని. పామఱ్ఱు సర్వస్వమును మూడు భాగములుగా రచించి ప్రచురించితిని. ఇంకను ప్రచురింపవలసిన భాగములు కొన్ని కలవు.

ఇంతేగాక నూజివీడు సర్వస్వమును ప్రచురింప నాకోరిక కలిగినది. ప్రస్తుతము భాగమును రచియించి యిప్పుడు ప్రచురించితిని. దీనిలో లేని విషయములు రెండవ భాగమునందుండును. సర్వస్వము పూర్తికాలేదు గనుక సమగ్రముగ లేదని ప్రశ్నింపవలదని మనవి. ఈ గ్రంథములను కొని తోడ్పడ ప్రార్థన.

కోగంటి దుర్గామల్లికార్జునరాయకవి

# పీఠిక



గుడివాడలో జరిగిన సమావేశములలో కొన్నింటిని సూచించిన కొన్ని విషయములను ఈ గ్రంథమునుండి పాఠకులు గ్రహింపగలరు. కొన్ని ఆహ్వాన లేఖలు, సందేశములు, వ్యక్తులను గురించిన సమాచారములు కొన్ని బొమ్మలుకూడ దీనిలో కలవు.

శ్రీ కోగంటి దుర్గామల్లికార్జున కవిగారు విషయ సంకలనము గావించి వ్యయ ప్రయాసల కోర్చి దీనిని ప్రకటించిరి. వీరికి అభినందనీయోండ్లు జాటినవి.

సాహిత్య సుధాకర,

**తేకుమళ్ల రామచంద్రరావు, ఎం.ఏ., బియల్. వకీలు,**

బందరు, 5-4-1972.

# గుడివాడ సర్వస్వము

## (మొదటిభాగము)

## ఆహ్వాన పత్రికలు

అయ్యా!

బ్రహ్మశ్రీ భమిడిపాటి అయ్యప్పశాస్త్రిగారి షష్టిపూర్తి మహోత్సవము జనవరి 28 వ తారీఖున గుడివాడ మునిసిపల్ హైస్కూలులో జరుగును. సభకు విచ్చేయ ప్రార్థన.

ఉదయము - గజారోహణ మహోత్సవము, మధ్యాహ్నము - మహాసభ, అధ్యక్షులు శ్రీ యెక్కిని సుబ్రహ్మణ్యముగారు. ప్రారంభకులు శ్రీ రాళ్ళబండి సీతారామశాస్త్రిగారు బి. ఏ, బి. యల్. ఉపన్యాసకులు - శ్రీయుతులు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, కాశీ కృష్ణాచార్యులు, కాటూరి వేంకటేశ్వరరావు, కోలవెన్ను రామకోటేశ్వరరావు, తేరుమళ్ళ రామచంద్రరావు, జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి, పెంపటి పురుషోత్తం, గోనుగుంట్ల సుబ్రహ్మణ్యగుప్త, విశ్వనాథసత్యనారాయణ, యస్.టి.జి.వరదాచార్యులు, జి.మోహనరామశర్మ. ఇట్లు, ఆహ్వానసంఘము:-గుడివాడ,
11-1-1950.

# ఆహ్వానము

## కవి సన్మానసభ – కవితాగోష్ఠి

మార్చి 1వ తేది సాయంకాలము 8–30 గంటలకు మునిసిపల్ హైస్కూలు గుడ్లవల్లేరు హైస్కూలు హెడ్మాష్టరుగారయిన శ్రీ చాపరాల సత్యనారాయణగారి యధ్యక్షత క్రింద, కవిరత్న శ్రీ శ్రీరాం వీరబ్రహ్మకవిగారికి భారతీ సన్మాన సంఘమువారు సన్మానము చేసెదరు. కనుక దయతో నెల్లరు విచ్చేయుడు ప్రార్థన. ఇట్లు భారతీ సన్మానసంఘము–గుడివాడ. 26–2–1953

# ఆహ్వానము

కవిరత్న శ్రీ శ్రీరాం వీరబ్రహ్మకవిగారి యధ్యక్షత క్రింద జనవరి 24 వ తేది సాయంకాలము 3 గంటలకు గుడివాడ మ్యునిసిపల్ హైస్కూలులో శ్రీ భారతీసన్మానసంఘము 8వ వార్షికోత్సవము జరుగును. ఉపన్యాసకులు – ప్రాచ్యకవి విమర్శకాగ్రేసర కొత్త భావయ్య చౌదరిగారు మొదలయినవారు. 4 గంటలకు ఉభయ భాషాప్రవీణ శ్రీ జాస్తి వేంకట నరసయ్యగారి యధ్యక్షత క్రింద శ్రీ షేక్ షరీఫ్ కవిగారికి సన్మానము జరుగును. కనుక దయచేసి యెల్లరు విచ్చేయుడు. ప్రార్థితులు. ఇట్లు భారతీ సన్మాన సంఘము – గుడివాడ 8–1 1054.

# ఆహ్వానము

నే నెల 4 వ తేది సాయంకాలము 5 గంటలకు శ్రీ బొడ్డపాటి పూర్ణసుందరరావు పంతులుగారి షష్టిపూర్తి

సన్మాన మహోత్సవము శ్రీ పెనుమచ్చ సత్యనారాయణ రాజుగారియధ్యక్షతక్రింద గుడివాడ మునిసిపల్ హైస్కూలులో షష్టిపూర్తి సన్మాన సంఘమువారు జరిపెదరు. గాన నెల్లరు దయతో విచ్చేయ ప్రార్థన. శ్రీ డి. వి. కృష్ణయ్యగారు బి. కాం. ఆనర్సు మహాసభను ప్రారంభించెదరు. ఇట్లు, బుధ విధేయుఁడు, కోగంటి దుర్గామల్లికార్జునరావు, సన్మానసంఘ కార్యదర్శి, గుడివాడ, 13-4-1954.

## కవి సన్మానము

సోదరులారా! గుడివాడ మ్యునిసిపల్ హైస్కూలులో డిశంబరు 12 వ తేది సాయంకాలము 4 గంటలకు బందరువాస్తవ్యులైన శ్రీ చిత్రపు హనుమంతరావుగారికి సన్మానము చేయఁబడును. అధ్యక్షులు - శ్రీ శేషాచార్యులు బి. ఏ. యల్. టి. గారు. ప్రారంభకులు శ్రీ శాస్త్రి వేంకటనరసయ్యగారు. ఉపన్యాసకులు-శ్రీయుతులు శ్రీరాం వీరబ్రహ్మకవి, కృత్తివెంటి వేంకటేశ్వరరావు, కోలవెన్ను పరబ్రహ్మకవి, విన్నకోట ఉదయభానురాజుగార్లు నింకఁబలువురు ప్రసంగింతురు. ఎల్లరు సభకు విచ్చేయ ప్రార్థితులు. ఇట్లు భారతీ సన్మానసంఘము, పామర్రు, 4-12-1964.

## అష్టావధానము

ది 17-9-1960 శనివారము సాయంకాలము 6 గంటలకు శ్రీ వేణుగోపాలస్వామివారి దేవాలయములో శ్రీ భారతీ సమితి ఆధ్వర్యమున, అష్టావధానము నిర్వహింప

బడును. సహృదయులు, రసజ్ఞులు సకాలమునకు విచ్చేసి సభా కార్యక్రమమును జయప్రద మొనరింపఁ బ్రార్థన.

కార్యక్రమము – అధ్యక్షులు శ్రీ యెర్రోజు మాధవ చార్యులుగారు ఎం. ఏ. స్వాగతము మధురకవి శ్రీ కాకా నరసింహారావుగారు, ప్రారంభకులు శ్రీ గడ్డమణుగు సీత రామాంజనేయులుగారు బి. ఏ, బి యల్, రచయితల సంఘ ధ్యక్షులు. అవధాని – కళాకోవిద, బాలసరస్వతి, లలితకవి శ్రీ పేరాంజనేయశర్మగారు, ప్రశంస – భాషాప్రవీణ శ్రీ ఇంకా శ్రీశైలపతిశాస్త్రిగారు, సన్మానము – వందన సమర్పణ – ఉభయ భాషాప్రవీణ, విద్వాన్ శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావుగారు. ఇట్లు, జాస్తి వేంకటనరసయ్య (అధ్యక్షులు) కోగంటి దుర్గామల్లికార్జునరావు (కార్యదర్శి) గుడివాడ, 19–9–1960.

## ఆహ్వానము

సోదరులారా! నేను రచించి ప్రచురించిన శల్యోత్పత్తి కతకము ఆవిష్కరణోత్సవము నవంబరు 26 వ తేది సాయం కాలము 4 గంటలకు, శ్రీ పొట్టి శ్రీరాములు హయ్యరు సెకండరీ స్కూలులో జరుగును.

సభాధ్యక్షులు – శ్రీ చిన్నకోట మాధవరావు బి. ఏ. కనుక మీ రందరు దయతో సభకువిచ్చేసి సభనుజయప్రదము గావింపఁ బ్రార్థన. ఇట్లు విద్యాద్విధేయుడు, విద్వాన్, ఉభయ భాషాప్రవీణ కోగంటి దుర్గామల్లికార్జునరావు, ఎక్స్టెన్షన్ గ్రంథపాలాధ్యక్షుడు, గుడివాడ, 10–11–1962.

అధ్యక్షులు నాట్యాచార్య శ్రీ బి. వి. నరసింహా రావుగారు బి. ఏ. బి. ఇ, డి. పలువురు ప్రసంగింతురు, ఎల్లరు విచ్చేసి సభను జయప్రదముగావింపప్రార్థన. ఇట్లు జా స్తి వేంకటనరసయ్య (భారతీ సమితి యధ్యక్షుడు) కోగంటి దుర్గామల్లికార్జునరావు (కార్యదర్శి) గుడివాడ, 4-8-1968.

## ఆహ్వానము

సుజనులారా! ఈ నెల 29 వ తేది యాదివారము సాయంకాలము 5 గంటలకు స్థానిక శ్రీ బాపూజీ గ్రంథాలయ భవనములో భారతీ సన్మాన సంఘాధ్వర్యమున, ఆంధ్ర కేసరి పత్రికా సంపాదకులు శ్రీ పెనుమ_ర్తి లక్ష్మీపతి శాస్త్రిగారి జన్మదినోత్సవము జరుగును.

అధ్యక్షులు – శ్రీ విస్సకోట మాధవరావుగారు బి.ఏ, పలువురు ప్రసంగింతురు. ఎల్లరు విచ్చేసి సభను జయప్రదము గావింపప్రార్థన. ఇట్లు జా_స్తి వేంకటనరసయ్య (అధ్యక్షుడు) కోగంటి దుర్గామల్లికార్జునరావు (కార్యదర్శి) గుడివాడ, 25-9-1968.

## ఆహ్వానము

### షష్టిపూర్తి మహోత్సవము

సోదర సోదరీమణులారా!

భారతీ సమితి యాధ్వర్యమున గుడివాడలో శ్రీ పొట్టి శ్రీరాములు మునిసిపల్ హైస్కూలులో నవంబరు 7 వ తేది, ఆదివారము ఉదయము 8 గంటలకు శ్రీ కింతికంటి కోటేశ్వర

రావుగారి షష్టిపూర్తి మహోత్సవము జరుగును. శ్రీయుతులు కోగంటి దుర్గామల్లికార్జునరావు, కోడూరి శ్రీరాములు, బాలాక-శ్రీరాములుగార్లకు సన్మానము జరుగును.

సభాధ్యక్షులు సాహితీ సుధాకర శ్రీ శేషమాళ్ల రామచంద్రరావుగారు యం. ఏ, బి. యల్, వకీలు, బందరు. ప్రారంభకులు శ్రీ యం. సుబ్రహ్మణ్యముగారు, పామర్రు పంచాయతీ స్పెషల్ ఆఫీసరు.

## కృతి సమర్పణ మహోత్సవము

సాయంకాలము 4 గంటలకు "అన్నపూర్ణానంద శతకము"ను శ్రీమతి పిండికంటి అన్నపూర్ణమ్మగారు తమ భర్త శ్రీ కోటేశ్వరరావుగారికి సమర్పింతురు. తమ గురువు శ్రీమతి దుర్గా భానుమతిగారికి సన్మానము చేసెదరు. సభాధ్యక్షులు విద్వాన్, కవిరత్న శ్రీ నంగవోలు ఆదిశేషశాస్త్రిగారు ఎం. ఏ. బి యి డి. ప్రారంభకులు బాలబంధు శ్రీ బి. వి. నరసింహారావుగారు బి. ఏ. బియిడి, రిటైర్డు డిప్యూటీ ఇన్స్పెక్టరు ఆఫ్ స్కూల్సు. పలువురు ప్రసంగింతురు. ఎల్లరు విచ్చేయ ప్రార్థన.

ఇట్లు

పసుమర్తి రామకృష్ణమూర్తి,
భారతీ సమితి అధ్యక్షుడు

గుడివాడ
25-10-1971

కోగంటి దుర్గామల్లికార్జునరావు
కార్యదర్శి

# ఆంధ్ర గ్రంథ రత్నాకరము

## ప్రధాన పోషకులు

లింగం వెంకటసుబ్బయ్యగారు బొమ్మలూరు, వల్లూరు పల్లి కోదండరామయ్యగారు దాకరం, అనపా సుబ్బారాయుడు గారు గుడివాడ, పురాణం సూరిశాస్త్రిగారు బి. ఏ, బందరు, మల్లిరెడ్డి గురవారెడ్డిగారు జొన్నపాడు, మాగంటి వేంకట రామదాసుగారు తమిరిశ, చిట్టూరి వేంకట నరసింహాగారు బందరు, సూరపనేని సుబ్బయ్యచౌదరిగారు దింటకుర్రు, కొల్లంకి రామదాసుచౌదరిగారు అప్పికట్ల, కొడాలి ఉమామహేశ్వర రావుగారు జనర్లపూడి, నల్లభనేని రామకృష్ణయ్య చౌదరి గారు జమీగొల్వేపల్లి, కరికినేని వేంకటరామయ్యగారు చినపారుపూడి, కామినేని గోపాలకృష్ణయ్యగారు గుడ్లవల్లేరు ఉప్పలపాటి నాగయ్యగారు గురజ, జొన్నలగడ్డ రామచంద్రయ్యగారు గుడివాడ.

## పోషకులు

నంబూరు వరాహాలక్ష్మీనృసింహాంగారు అరుగొలను పింగళి కుటుంబరావుగారు లింగాల, కూచిభట్ల వేంకటచలపతి శాస్త్రిగారు కొర్నిపాడు, గో॥ భా॥ రామచంద్రరావు నౌరగారు తలవభద్ర, గంజాంజిల్లా, యలమంచిలి నాగయ్యగారు నూజెళ్ల, సిరిపురపు వేంకటరత్నంగారు ఎలమర్రు, కోనేరు నారాయణరావుగారు భార్గపూడి, అట్లూరి వేంకటపతిగారు చౌటపల్లి, పాటిబండ్ల సీతారామయ్యగారు అరుగొలను, సీతం

రాజు హనుమంతరావుగారు జువ్వనపూడి, శ్రీ. వేంకటాచలం గారు పెనుమల్లి, మువ్వ భూషయ్యగారు మురుకొండ, పర్వతనేని గంగయ్యగారు పోలుకొండ. శివలెంక మల్లికార్జున రావుగారు పెసరమిల్లి, చలసాని వేంకటరత్నంగారు చిరుచింతల, నల్లభనేని చౌదరయ్యగారు జమీగొల్వేపల్లి, వల్లభనేని రామశాస్త్రిలుగారు జమీగొల్వేపల్లి. శింగవరపు రామయ్య గారు కొమరవోలు, శ్రీ పొట్లూరి సీతయ్య కొమరవోలు, శ్రీ పొట్లూరి వేంకటరత్నం కొమరవోలు, శ్రీ హరిగుండేరావు కల్వపాముల, శ్రీ మానికొండ కుటుంబరావు ఉరుటూరు, శ్రీ కోవెలమూడి పరంధామయ్య కోలవెన్ను, శ్రీ ఈడుపుగంటి సీతయ్య వందివాడ, శ్రీ కొత్తపల్లి రామకుటుంబయ్య గుడివాడ, శ్రీ బ్రహ్మభట్ల పట్టాభిరామశర్మ గుడివాడ, శ్రీ రాజ వేంకటరామయ్య పసుమర్రు, శ్రీ నూకల వీరరాఘవయ్య కానుమోలు, శ్రీ పోతిన శ్రీనివాసరావు బెజవాడ, శ్రీ అడుసుమల్లి వేంకటకృష్ణయ్య చిరుచింతల, శ్రీ ఉప్పలూరి ఆది నారాయణమూర్తి గుడివాడ, శ్రీ తిపిర్నేని సుబ్రహ్మణ్యం గుడివాడ, శ్రీ పరిమి వేంకటఅచ్చయ్య నడాలి, శ్రీ కొల్లి చిన వేంకటరామయ్య అప్పికట్ల, శ్రీ వల్లూరుపల్లి కనకదుర్గమ్మ వేల్పూరు, శ్రీ పిడికిటి సూర్యనారాయణ పునాదిపాడు, శ్రీ పాలపర్తి వాలేశం పాలపర్రు. శ్రీ గూడూరి మల్లికార్జునుడు నగళూరు, శ్రీ కోడూరి రంగయ్య కోడూరు, శ్రీ అద్దేపల్లి కృష్ణయ్య కోడూరు, శ్రీ కొండపల్లి నారాయణస్వామిరెడ్డి పొన్నపాడు, శ్రీ కొడాలి వీరభద్రయ్య చినపారుపూడి.

# భమిడిపాటి అయ్యప్పశాస్త్రిగారి

## షష్టిపూర్తి మహోత్సవము

### ఆ శీ ర్వ చ న ము

తే॥ భమిడిపాటి అయ్యప్పశాస్త్రి బ్రదుకుఁగాక !
మఱల నొక షష్టి వత్సరాల్ మాన్యుఁడగుచు
అయువెల్ల నిరామయం బగునుగాక !
ముదిమి రంపపు బాల్యమై పొదలుఁగాక॥

చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, శతావధాని

## పద్యరత్నములు

ఆ॥ గురువులందు భక్తి గోరంతయినఁగాని
కననియట్టి చెడ్డ కాలమందు
గురుఁడె దేవుఁడనుచు గురుపూజలను జేయు
మల్లికార్జునుండు మాన్యతముఁడు॥

ఆ॥ అనఘ! భమిడిపాటి అయ్యప్ప శాస్త్రిగా
రెట్టి ప్రేమ గలిగినట్టి వారొ!
శిష్యరత్నమైన శ్రీ మల్లికార్జును
చిత్తమంత భక్తిచే రహింప॥

కం॥ గురుశిష్యుల న్యాయంబును
గురుపూజలు మఱలఁ బ్రబలి కొమరులు లోకో
త్తమమౌ పద్ధతులఁగ శ్రీ
భరతమ్మ యపూర్వపూర్వప్రథఁగనుఁగాతన్॥

మంగిపూడి వేంకటశర్మ

# అభినందనము

సీ॥ అవధానముల నెన్నొ యానందముగఁ జేయు
అయ్యప్పశాస్త్రిని నభినుతింతు
సరళ కవిత్వంబు చక్కఁగాఁ జెప్పెడి
అయ్యప్పశాస్త్రిని నభినుతింతు
కవియుఁ బండితుఁడయ్యు గర్వంబెఱుంగని
అయ్యప్పశాస్త్రిని నభినుతింతు
ఘనులైన శిష్యకోటినిఁ గల్గియున్నట్టి
అయ్యప్పశాస్త్రిని నభినుతింతు

తే॥ ఇట్టి సద్గుణశాలి కింకెన్నొ యిట్టి
షష్టిపూర్త్యుత్సవంబులు జరుగునట్లు
ఆయురారోగ్య సంపద లమరఁ జేయ
వాసవాంబను బ్రార్థింతు వాంఛతోడ॥

తే॥ భక్తవత్సలుఁ డైనట్టి ధర్మశీలి
వంశచంద్రుఁ డయ్యపశాస్త్రి సరళకవిత్వ
పటిమ నపూర్వ యనఁదగు వసుధయందు
అట్టి మహనీయునకుఁ గూర్తు నభినుతుల్॥

తే॥ తప్పకింకెన్నొ షష్టిపూర్త్యుత్సవములు
కరము జరుగును వాసన కరుణవలన
మేలు జనులకుఁ గలుగును నిక్కముగ
సందియంబందఁ బోకుఁడు సరసులార!

అడ్డేపల్లి సత్యనారాయణ, మండపల్లి



శ్రీ బారిష్టరు లింగం వీరభద్రయ్యాచారి



శ్రీ షేక్ అలి

శ్రీ. వేణుగోపాలంగారి సన్మానము 1950

## ప్రశంస

ఆర్యా! చిత్రలేఖనమందు తమకున్న అప్రతిమాన కౌశలమును నేను ప్రత్యేకముగా వర్ణించ పనిలేదు. మిమ్ము చుట్టుముట్టిన శిష్యబృందమే తమ ప్రతిభకును కళా వ్యాప్తికిని తార్కాణము.

గుళ్లపల్లి రామబ్రహ్మం, కురుమద్దాలి

## మా గోపాలంగారు

ఆన 1900 సంవత్సరమునందు, ఆగస్టు 31 వ తారీఖున గంజాం జిల్లాలోని పర్లాకిమిడియందు మా గోపాలంగారు జన్మించిరి. తల్లి నారాయణమ్మగారు. తండ్రి వెంకటరెడ్డిగారు. శ్రీ గోపాలంగారు జన్మించిన మొదటిసంవత్సరముల లోనే నారాయణమ్మగారు కాలధర్మము నందిరి. జగన్నాథ రావుగారు గోపాలంగారి పెదతండ్రి. అప్పుడు జగన్నాథరావు గారు పర్లాకిమిడిలో గవర్నమెంటు ఆస్పత్రిలో సర్జనుగాపని చేయుచుండెడివారు. నారాయణమ్మగారు చనిపోవుట వలన గోపాలంగారిని జగన్నాథరావుగారు పోషించిరి. గోపాలంగారు పర్లాకిమిడి మహారాజుగారి హైస్కూలులో 1 వ ఫారములో ప్రవేశించి 4 వ ఫారమువరకును చదివిరి. చిత్రములను వ్రాయుటయందు వీరికి బాల్యమునుండియు నమితోత్సాహము.

శ్రీ మహారాజాగారి హైస్కూలులో సీనియరు డ్రాయింగు టీచరుగాపని చేయుచున్న శ్రీ సాలెపు సుబ్బా

1933 వ సంవత్సరములో చేతవోలులోని యాశ్రమమువారు శ్రీరామకృష్ణ పరమహంస వర్ధంత్యుత్సవ సందర్భమున రజత పాత్రను బహూకరించిరి. అనేక ప్రశంసా పత్రములను బడసియున్నారు.

1938 వ సంవత్సరములో డిజయిన్ హాయ్యర్ ఫస్టు క్లాసునందును, 1939 వ సంవత్సరమున గవర్నమెంటు హయ్యర్ డ్రాయింగు పరీక్షయందును నుత్తీర్ణులైరి. 1947 వ సంవత్సరములో రాజధానియందు ఫస్టుక్లాసులో ఫసుగ వచ్చుటవలన వెంకటింగు గ్రేస్టు మెమోరియల్ గోల్డుమెడలును బొందిరి.

1940 వ సంవత్సరమునుండి 42 వ సంవత్సరము వఱకు గవర్నమెంటు డ్రాయింగు పరీక్షలకు నసిస్టెంటు ఎగ్జామినరుగాఁ బనిచేసిరి. స్థానములను బరిశోధించుట కొఱకు గుడివాడ నుండి బయలుదేరి 1946 వ సంవత్సరము మే నెల 13 వ తేదీనుండి 20 వ తేదీవఱకు ఎల్లోరాయందును 21 వ తేదీనుండి 30 వ తేదీవఱకు నజంతాయందును జూన్ 1 వ తేదీనుండి 10 వ తేదీవరకు నెలిఫంటా గుహలయందును బర్యటించిరి. నాగార్జునకొండకు మూఁడు పర్యాయములు వెళ్ళిరి.

అజంతా మున్నగు ప్రదేశములలో గోపాలంగారిచేఁ జిత్రింపఁబడిన చిత్రములాంధ్రపత్రిక యుగాదిసంచికలయందును, భారతి మాసపత్రిక సంచికలయందును ప్రచురింపఁబడినవి. గుడివాడకు వచ్చిన నాఁటినుండి ప్రతి సంవత్సరము సుమారు

20 మంది డ్రాయింగు అండ్ పెయిన్టింగులో వీరియొద్ద, ట్రెయినింగు పొందుచున్నారు.

1949 వ సంవత్సరములో వీరి శిష్యులలో నొకరు సువర్ణ పతకము నొందిరి. అయిదుగురుశిష్యులు డిప్లొమాలను బొందిరి. వీరి శిష్యులలో సుమారు 60 మంది మాధ్యమికోన్నత పాఠశాలలలో డ్రాయింగు టీచరులుగా బనిచేయుచున్నారు. చిత్రకళా పరిశీలనార్థము శిష్యబృందముతో నజంతా మున్నగు తావులకు పదపదగుగు యున్నారు. సుప్రసిద్ధము లయిన వీరి తైలవర్ణ చిత్రములు ప్రయివేటు అండ్ పబ్లిక్ సంస్థలలో ప్రదర్శింపబడినవి. 1950 వ సంవత్సరములో గోపాలరావుగారు కృష్ణాజిల్లా డ్రాయింగు టీచర్ల సంఘమునకు కార్యదర్శులుగా నెన్నుకొనబడిరి.

## లలిత కళోపాసకులు

లలిత కళోపాసకులగు శ్రీ కె. వేణుగోపాలంగారు మాకు చిరపరిచితులు. వారు చిత్రలేఖనమునందు జక్కని ప్రతిభను గడించి పురాతన శిల్పనిలయములగు నెల్లూరా, అజంతా గుహాలయములయందున్నట్టి శిల్ప సంపదల విశిష్టతను గుర్తించి వచ్చి నాటి విద్యార్థిలోకమును జాగృతము చేయుటలో మిక్కిలి కృషి సల్పుచున్నారు. పూర్వమీ మహాకార్యము బందరునందలి యాంధ్ర జాతీయ కళాశాలలో నెరవేర్పబడుచుండెడిది.

చాలకాలమునుండి యా కళాశాల పని చేయకుండుటచే శ్రీ వేణుగోపాలముగారా పనిని నెరవేర్చుచు నా

సందర్భంలో తీరుబడి లేక పద్యరూపంగా నా సందేశాన్ని అందింపలేనందుకు విచారిస్తున్నాను. శ్రీ చౌదరిగారి సన్మానసభ జయప్రదంగా జరుగుతుందని ఆశిస్తున్నాను.

భవదీయుడు, జి. జాషువ, గుంటూరు, 7-11-52.

౦ ౦ ౦

శ్రీ భారతీ సమ్మాన సంఘమువారికి — డిగ్రీలు లేని పాండిత్యము వన్నెకురాని ఈ కలికాలంలో భావయ్యపంతులని సంభావించుటచేసి భారతీ సమ్మాన సంఘంవారినే మున్ముందు అభినందింతును.

సంగభూపాలీయాది శాస్త్రములు, నగర పట్టాభిషేకాది రూపకములు, వ్యామోహామునంటి నవలలు, శంకర శతకము వంటి శతకములు, శతాధికముగా, సహస్రాధికముగా మనము సంపాదించుకొనవచ్చును. కాని యెంతో శ్రమ చేసినగాని, ఎంతో వ్యయ పెట్టినగాని ఎన్నాళ్లో — కాదు కాదు ఎన్నేళ్లో దీక్షగా పరిశ్రమించినగాని దొరకరాని, అందరాని సాంఘిక చరిత్రమును సాంగోపాంగముగ శ్రద్ధశ్రద్ధగా ఒక జాతిచేతికి అందించిన ఈ భావయ్యచౌదరిని ఒక సంఘమేగాదు, ఒక జాతియేగాదు, తెలుగుగడ్డ అంతయు సమ్మానించి తీరవలెననియే నా కోరిక. సంపన్నులందఱు ఉత్సాహప్రోత్సాహము లిచ్చి తీరవలెననియే వినయపూర్వకమైన నా హెచ్చరిక. ఇది ఎందులకందువా? ఒకసారి చిత్తగించు.

ఎన్నికలు మున్నగు ఎన్నో ఎన్నికరాని ఘట్టములలో అక్షర లక్షలుగా ఖర్చుపెట్టి నేర్చిన యీ జాతి చదువుసాము

టలో ఒకానొక జాతి ఇతరజాతులకు అన్యాయము చేసిన రహస్యము ఎన్నడో గుర్తించిన ఈ జాతి ఇట్టి చరిత్రకారునకు, ఇట్టి విద్వాంసునకు ఎట్లు చేయూతనిచ్చి ఎంతగా ఆదరింపవలసియుండునో ఇట్టి సమావేశములైన ప్రచుర ప్రచారములు చేసి ఎరిగింపవలెనని నా ప్రార్థన

చదువుసంధ్యల చవిచూచనేరని సంపద ఒక సంపద కాదు. జాతియొక జాతికాదు. దేశముయొక దేశముకాదు. ఇదే నా సందేశము.

భవదీయుడు, కొత్త సత్యనారాయణచౌదరి, పండిట్ బోర్డు హైస్కూలు, కొల్లూరు, 10-11-52.

o o o

చిత్రపు హనుమంతరావుగారికి సన్మానము

1954 వ సంవత్సరము డిశంబరు 19 వ తేది సాయంకాలం 5 గంటలకు మునిసిపల్ హైస్కూలులో శ్రీ బి శేషాచార్యులు బి. ఏ. యల్. టి. (తెలుగు పండితులు) గారి యధ్యక్షతక్రింద బందరు వాస్తవ్యులును, నాటక కర్తలును, పత్రికా సంపాదకులునయిన శ్రీ చిత్రపు హనుమంతరావుగారికి పాపట్ల భారతీ సన్మాన సంఘమువారు సన్మానం చేశారు.

డాక్టరు శ్రీ అద్దేపల్లి నారాయణరావు, శ్రీ కూచిభొట్ల గోపాలకృష్ణమూర్తి ప్రభృతులు సభకు విచ్చేశారు. ఆసీనులగుటకు హనుమ[illegible] కాకాని నరసింహారావుగారు పద్యములతో [illegible] ప్రార్థనతో సభ ప్రారంభమయింది.

సన్మాన సభను ప్రారంభించుచు కవికి కర్షకునకుగల ప్రాధాన్యము గురించి ప్రసంగించారు. అధ్యక్షులయిన శ్రీ బి. శేషాచార్యులుగారు కవిగారిని ప్రశంసించుచు సమాజమే కవులను పోషించవలయునని ఉద్ఘాటించారు. శ్రీయుతులు విద్వాన్ రామిరెడ్డి నారాయణరెడ్డి, బాలకవి కేసరి వాకాటి పంచాల రెడ్డిగార్లు పంపిన సందేశములను శ్రీ స్వ. కే. నగవరాజులు గారు చదివిరి.

శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావు కార్యదర్శి నివేదికను చదివి సన్మాన పత్రమును చదివిన తాంబూలాదులను ఖడ్గము శాల్వను కవిగారికి సామగ్రి భారతి సన్మాన సంఘం తరఫున సమర్పించారు.

శ్రీ వల్లూరి మోజెస్ మోహన్‌గారు కవిగారి నాటకములలోని పద్యములు కొన్ని శ్రావ్యముగా చదివి వినిపించారు. శ్రీయుతులు కవిరత్న, ఆంధ్రభాషా వాచస్పతి శ్రీరాం వీరబ్రహ్మకవి, కొండూరి నరసింహారావు, కృత్తివెంటి వెంకటేశ్వరరావు, కవులూరి ఆదినారాయణశర్మగార్లు ప్రశంసా పద్యములను చదివిరి. శ్రీయుతులు జోసెఫ్ రత్నము, శ్రీలక్ష్మీ వీరబ్రహ్మకవి, గుత్తా వీరరాఘవులు బి. ఏ. బి. ఇడి. కవిగారిని గురించి యుపన్యసించారు. శ్రీ హనుమంతరావుగారు పద్యరూపమున నుచితరీతిని సమాధానము నొసంగిరి. అధ్యక్షుని యంత్యోపన్యాసానంతరం శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావుగారి యభినందనములతో సన్మానసభ ముగిసెను. అనంతరం గ్రూపు ఫోటో తీయబడెను.

౦ ౦ ౦

## సరస్వతీ సామ్రాజ్య శాఖా ప్రారంభోత్సవము

1961 వ సంవత్సరం మార్చి నెలలో ఉగాది పండుగ నాడు స్థానిక శ్రీ వేణుగోపాలస్వామి ఆలయంలో సరస్వతీ సామ్రాజ్యశాఖ ప్రారంభోత్సవం, శ్రీ అయ్యగారి వెంకట రమణయ్య పంతులుగారికి సప్తతి మహోత్సవం మహావైభవంగా జరిగినవి.

శాసనమండలి అధ్యక్షులు శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులు అధ్యక్షత వహించిన ఈ మహాసభను శ్రీ చాటుకువాడ సరసి హంసంలులు ప్రారంభిస్తూ ఓం అనే అక్షరంలో సర్వశాస్త్రాలు ఇమిడి ఉన్నాయని అంటూ, అయితే ఇప్పుడు విద్యా సంస్థలలో బోధించేది అక్షరజ్ఞానమే కనుక నేటి విద్యావిధానం, ధన కాముకుల చేతులలో పడినట్టు అయినదని అన్నారు.

అందువల్ల ఈవిద్యా విధానం పోవాలనిద్రహం, పరం తెలుసుకున్న అక్షరవిద్యయేమో విద్యయని, అటువంటి విద్య ఈ సరస్వతీ సామ్రాజ్య శాఖద్వారా నేర్పి ప్రజ్ఞావంతులను, విజ్ఞానవంతులను తయారు చేయగలదని ఆశిస్తున్నానన్నారు.

శ్రీ కాటూరి వెంకటేశ్వరరావు, శ్రీ కాకాని నరసింహారావు రచించిన "సరస్వతీ సామ్రాజ్యం" అనే గ్రంథాన్ని ఆవిష్కరిస్తూ, శ్రీ వెంకట రమణయ్యపంతులు బాలభటోద్యమం, గ్రంథాలయ స్థాపన మొదలగు ఉద్యమాలలో ప్రముఖపాత్ర వహించిన బహుముఖ ప్రజ్ఞావంతులని, ఇప్పుడు



శ్రీ అనుపమల్లి నారాయణరావు



శ్రీ యెర్నేని వేంకటేశ్వరరావు

ఈ సరస్వతీ సామ్రాజ్య స్థాపన తలపెట్టడం, ముదావహమని వారి ప్రయత్నాన్ని ప్రస్తుతించారు.

ఈ సందర్భములో శ్రీ వెంకటరమణయ్య, శ్రీ కోన వెంకటరాయశర్మ, శ్రీ బమ్మలమడక మాధవరామశర్మ, సరస్వతీ సామ్రాజ్య గ్రంథకర్త శ్రీ కాకాని నరసింహారావు గార్లను గుడివాడ పౌరులు ఘనంగా సన్మానించి పండిత శాలువలను బహూకరించారు. సన్మానితులు ఉచితరీతిని సమాధానమిస్తూ తమ కృతజ్ఞతను తెలియజేశారు.

శ్రీ వెంకటరమణయ్య పంతులు సమాధానమిస్తూ ఈ సరస్వతీ సామ్రాజ్యం నూతన రూపురేఖలతో, గ్రంథాలయోద్యమానికి నూతన శాఖగా, గ్రంథాలయ పితామహులైన శ్రీ పాములపాటివారి అధ్యక్షతను పల్లె ప్రతి పల్లెలోను, పట్టణంలోను శాఖోపశాఖలుగా వ్యాపించగలదని అందుకు తగిన చేయూతనీయవలసినదని పౌరులను కోరారు.

ఈ సందర్భములో శ్రీయుతులు ఉన్నవ గోపాల కృష్ణయ్య, చింతామణి భావయ్యచౌదరి బాపట్ల పాలకోడేటి సత్యనారాయణ, కోగంటి దుర్గామల్లికార్జునరావు, గురజాడ రాఘవశర్మ, తుమ్మలపల్లి శివరావు, కోట వీరాంజనేయులు వి. టి. యల్. నరసింహాచార్యులుగార్లు ఉపన్యసించారు.

ఉత్తరప్రదేశ్ గవర్నర్ శ్రీ బూర్గుల రామకృష్ణారావు కేరళ గవర్నర్ శ్రీ వి. వి. గిరి మంత్రి శ్రీ కల్లూరి చంద్రమౌళి, జస్టిస్ మునికన్నయ్య, డిప్యూటీ స్పీకర్ శ్రీమతి

సదాలక్ష్మి, డాక్టర్ లక్కరాజు గోకర్ణేశ్వరరావు, రాజమండ్రి భారతీ సేవాసదనం, శ్రీ శివశంకరస్వామి, స్వామి సత్యానంద సరస్వతి వగైరా ప్రముఖులు శుభసందేశములను పంపారు.

అధ్యక్షులు శ్రీ మాడపాటి హనుమంతరావు తమ అంత్యోపన్యాసంలో శ్రీ వెంటరమణయ్యగారన్నట్లు ఈ కార్యక్రమం జనాదరణ పొంది సరస్వతీ సామ్రాజ్యం శాశ్వతశాఖలుగా వర్ధిల్లగలదని అంటూ, ఈ అవకాశాన్ని తమకు లభింపచేసిన గుడివాడ పౌరులకు తమ కృతజ్ఞతను వెల్లడించారు. ఉపాధ్యక్షులు శ్రీ పెయ్యేటి వెంకట్రావు అంత్యాభినందనములతో సభ ముగిసినది.

ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ [illegible] వెంకట అప్పారావు ఉదయం, శ్రీ ప్రణవానందస్వామి రాత్రి అహ్వానితులకు ఆతిథ్యమిచ్చారు.

శ్రీ మాడపాటి హనుమంతరావుగారికి 17 వ తేదీ సాయంత్రం నాలుగు గంటలకు గుడివాడ మున్సిపల్ కార్యాలయ భవనంలో పౌర సన్మానం జరిపారు. మున్సిపాలిటీ అధ్యక్షులు శ్రీ కోగంటి రాజగోపాలయ్య సన్మానపత్రం సమర్పించారు.

o o o

శ్రీ [illegible] గారి సన్మానము

1954 వ సంవత్సరము జనవరి 24 వ తేది సాయం కాలం 6 గంటలకు గుడివాడ మునిసిపల్ హైస్కూలులో

పామర్రు భారతీ సన్మాన సంఘాధ్వర్యమున, మధురకవి శ్రీ షేక్ ఫరీదుకవిగారికి సన్మానము జరిగెను. ఉభయ భాషా ప్రవీణ, జాతీయకవి శ్రీ జాస్తి వేంకటనరసయ్యగారు సభాధ్యక్షత వహించారు.

నేటి కవులలో ఫరీదు కవిగారు సుప్రసిద్ధులనియు "గోటఁగుప్రిక్కిన పేను" "తామర తంపర" మున్నగు అచ్చ తెలుగు పదప్రయోగములు వీరి కవితలో మెండుగా గన్పట్టు ననియు అధ్యక్షులుపన్యసించారు. ఉభయభాషాప్రవీణ, విద్వాన్ శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావుగారు కార్యదర్శి నివేదికను చదివిరి.

విద్వాన్ పెద్దింటి రామమూర్తి, కాకాని నరసింహా రావు, కొండపాటి లక్ష్మీసుబ్బారావుగార్లు కవిగారి కవిత్వమును కొనియాడారు. శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావుగారు భారతి సన్మాన సంఘము తరపున సన్మాన పత్రమును చందన తాంబూలఫలంబులను పంకిత శాలువాను శ్రీ ఫరీదుకవిగారికి సమర్పించారు. కవిగారు కృతజ్ఞతను వెలిబుచ్చారు. శ్రీ దుర్గా మల్లికార్జునరావుగారి వందన సమర్పణతో సన్మానసభ ముగిసింది.

## సందేశములు

అయ్యా! మీరు షేక్ ఫరీదుకవిగారికి సన్మానముచేయు చున్నందులకు చాలసంతోషించుచున్నాను ఆయన మెత్తనికవి.

## శ్రీ స్వామి వివేకానంద జయంతి

## 15-1-1967

మహాశయా! నమస్కారములు. శ్రీ వివేకానంద స్వామివారు లోకోత్తర పురుషులు. గొప్ప మేధావి. భగవద్భక్తుడు. గొప్పయోగి. గొప్పవక్త. తన వక్తృత్వముచే అమెరికనులు మొదలయిన పాశ్చాత్యులను ముగ్ధులనుగా జేసి కొందఱిని తన శిష్యులనుగా జేసికొనెను. అతని గ్రంథములు శాశ్వతముగ మననదగినవై యున్నవి.

మన దేశపు మతము అనగా హిందూమతముయొక్క యుత్కృష్టతను ప్రపంచ మంతటను చాటి మన దేశమునకు గొప్ప కీర్తి తెచ్చెను. అతడు గొప్ప త్యాగి. మన దేశప్రజల అభివృద్ధికై ఎంతయు కృషి చేసెను. అతనకు జోహార్లు అర్పించు చున్నాను.

మధురకవి [illegible] శేషగిరిరాజు, రాజమండ్రి, 7-1-67

మహాశయా! స్వామి శ్రీ వివేకానందవారి జన్మదినోత్సవం జనవరి 16 వ తేదీయున జరుగనున్నందులకు సంతోషించితిని. భారతీయులకు వారి సందేశములు అమూల్యములు. ఆదర్శ ప్రాయంబులు. అట్టి స్వామిగారి జన్మదినోత్సవము భారతీ సమితివారు చేయుట ఎంతయు యుక్తము. ఉత్సవము జయప్రదము కాగలందులకు ఆశించుచున్నాను.

వె, యస్ రావు బందరు, 9-1-67.

మహాశయా! నమస్తే. 16 వ తేదీని భారతీ సమితి యాజమాన్యాన జరుగు శ్రీ వివేకానంద జన్మదినోత్సవసభ గుడివాడలో జయప్రదముగా నెరవేరుగాక యని కోరు శ్రీ వివేకా

నందులవారి శతాబ్దములో మన హిందూ మతమును గురించి విదేశాలలో ముఖ్యముగా అమెరికాలో ప్రచారము చేయుటే కాక అచట కొన్ని యాశ్రమముల నిర్మాణమునకు కారకులైరనియు అట్టి పవిత్రమూర్తిని స్మరించుటయు, అనుసరించుటయు మన ధర్మమనియు మన ప్రజలకు తెలుపబడుగాక యనియు కోరెదను.

భవదీయుడు, కొత్త భాసయ్యచౌదరి, సంగంజాగర్లమూడి,
9-1-67

నమస్కారములు ---

కం॥ భారతీ విజ్ఞానమ్మును
నేసన్నమై చాటి దిశల నింపించినని
న్నారాధింతుము నీ కిల
నేరెవ్వరు సాటి నీకు వివేకానందా!

తే॥ ఆస్తికోన్నత కేసరి యాభిల భువన
భవన వైరాగ్యమూర్తి! ధీబలప్రసిద్ధి
విశ్వ విశ్వాంతర ఖ్యాతి వినుతిగన్న
సచ్చిదానందునకు నమస్కార శతము॥

పీ.కె అలీ బి. ఎ, బి ఇడి, బమ్ములపాలెం, 7. 1-67

శ్రీ వివేకానంద చంద్రోదయము

అదిగో! అల్లదిగో! కనుండు వివేకానంద
చంద్రోదయం
బదిగో! సముపస్ఫురత్కాంతిస్ఫాలి వెలుంగై
వెలుగుం జెట్టులో



శ్రీ బొడ్డపాటి ప్రాణసుందరరావు



శ్రీ బొడ్డపాటి లక్ష్మీసుబ్బారావు

బదియార్వ స్నెల వెన్నెలల్ గురియుచున్ బ్రహ్మాండ
భాండంబునన్
బొదలంబో విసీల మేఘము లు గోల్పోయెన
దదీయద్యుతుల్॥

## ప్రశంస

కం॥ ఏమి? వివేకానంద
స్వామి జయంత్యుత్సవమ్ము భారతి సమితీ!
పామఱునందు సలుపుదు
వా? ఘూన్యాశయవుసుమ్ము! నందనమమ్మా!

కం॥ నరుఁడు నరేంద్రుఁడు త
ద్గురుఁడే నారాయణుండు భరతధరిత్రీ
నరగర్భమునఁ గసర్భవ
సరణిని జనియించినారు సత్యము కలిలో॥

సీ॥ శ్రీ వివేకానంద పావనసందేశ
మమర సందేశమై యలరుఁగాత!
దిగ్దిగంతములఁ బ్రాకి ఋగ్వేదగానమై
సనమలానంద మొసరంగుఁగాత!
ప్రాక్పశ్చిమంబుల ద్వాక్పరిపూతమై
విశ్వశాంతికి మూలబీజమగుత!
అన్యోన్యసంవర్ధ కాశియౌన్నత్యంబు
జ్ఞానవిజ్ఞాన సంకలనమగుత!
రామకృష్ణాదిబోధకాగ్రణుల యూత

చేతమునకు నూత్న స్థయిర్యమిూఁతి! గురుల
యడుగుఁగెందామరలు గొల్చి యరుల నడచి
యనుభవింతురుగాత! యాత్మానుభూతి॥

మ॥ నరనారాయణ దివ్య తేజములతో నవ్యాకృతిన్ భారతీ!
తరుణీ గర్భమునన్ సముద్భవముఁజెందన్ నీవు నీ యొక్క స
ద్గురుఁడున్ గాను విశాల దుర్గుణ కుయుక్తిశ్రేణి సంతానముల్
వెలుఁగించెన్ రణరంగమునసువులర్పించున్ యథా ర్థంబుగన్॥

చం॥ పడమటి గాలిసోకుడు నవస్థల పాలగు భారతీయులన్
గడువడిఁ బ్రోవవచ్చిన యఖండ కృపామయమూర్తి నీవు నీ
యడుగుల జాడలన్నడచి యస్మహితాత్ముఁడుగూర్చె గాంధి దే
వుఁడు మన జాతికియ్యెడ నపూర్వ జయాభ్యుదయ స్వాతంత్రతల్

కం॥ సమతా స్వాతంత్ర్యమ్ములు
స్వమత మహత్త్వంబు దేశభక్తి సహిష్ణు
త్వము భూతదయ భగవదం
శమునం బొడమంది బోధసలిపితి వసుధా!

తే॥ విశ్వమత మహాసభకేగి విమలసత్య
వాక్క్రియా కలాపంబుల వలన సకల
జాతులకు జ్ఞానభిక్ష నొసంగినావు
నీ మహోపకారము స్మరణీయమయ్య॥

చం॥ తఱు గని జ్ఞానభిక్షు యిశితార్కిక బుద్ధికి నందఁబోనిమ
స్వరముని తత్త్వమున్ సులభ వాక్కుల నెక్కొనఁజేసి
కూటికిం
గఱువయి యేడ్చు పేద కొఱకై బహు జన్మములెత్తు
వాఁడ నా
కొఱకయి ముక్తిఁ గోర నను కూరిమి నెంచఁగ నూగుఁ
జిత్తముల్

తే॥ అంటు జాడ్యంబు స్త్రీ జాతి హైన్య వృత్తి
మూర్ఖ వేదాంత సిద్ధాంతములను కత్తి
తో బలెఁబలు సహస్రులం ద్రుంచినావు
లేదు మొగమాట మనునది లేశమైన॥

కం॥ నీ జన్మదినోత్సవమీ
యోజను బ్రతి సత్సభమ్ము మహిభక్తి నొసర్పం
గాఁజను భారతి సమితిని
బూజావాక్య ప్రసూనముల నర్పింతున్॥

విద్వాన్, కవిరత్న నంగవోలు ఆదిశేషశాస్త్రి
ఎం. ఏ, బి ఇడి, జగ్గాపురము, 8-1-67.

## కరెడ్ల నరసింహంగారి

# సంతాపసభ

భారతీ సమితి ఆధ్వర్యమున బ్రాంచి గ్రంథాలయంలో 1971 వ సంవత్సరం ఆగస్టు 30 న తేదీ సాయంకాలం భారతీ సమితి మాజీ అధ్యక్షులును, గౌరవాధ్యక్షులునగు శ్రీ కరెడ్ల నరసింహం వకీలుగారి స్మారకసభ జరిగినది. శ్రీ గడ్డమణుగు వెంకటప్పారావు బి. ఏ. బియల్. ఎడ్వకేట్ గారు సభాధ్యక్షత వహించారు శ్రీ కె. విఠల్ శాస్త్రిగారు దైవప్రార్థన చేశారు.

శ్రీయుతులు కోగంటి దుర్గామల్లికార్జునకవి, సంపూరి వెంకటాచార్యులు, మల్లంపల్లి రామలింగేశ్వరశర్మ, వేదము రామప్రభువు ఎం. ఏ, యల్. టి, పసుపులేటి రామకృష్ణ మూర్తి ఎం. ఏ, కోపూరి శ్రీరాములు, ఉప్పలూరి నాగభూషణరావు, గుళ్లపల్లి రామబ్రహ్మం, బొడ్డపాటి పూర్ణ సుందరరావు, బత్తిన మార్కండేయులు బి. ఏ. యల్. టి. గార్లు శ్రీ నరసింహంగారి సద్గుణములను కొనియాడారు. సంతాప తీర్మానమును గావించారు. శ్రీ దుర్గామల్లి కవిగారు వందన సమర్పణ చేశారు.

o o o

## కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి

# 79 వ జన్మదినోత్సవము

1971 వ సంవత్సరము 11 వ తేది సాయంకాలము బ్రాంచి గ్రంథాలయంలో భారతీ సమితి ఆధ్వర్యమున

కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి 79 వ జన్మ దినోత్సవం జరిగింది. సభకు శ్రీ వేమూరి రామకృష్ణయ్య బి. ఏ బి యల్ గారు అధ్యక్షత వహించారు. శ్రీ కె. విఠల్ శాస్త్రిగారు దైవప్రార్థన చేశారు. శ్రీ కోగంటి దుర్గామల్లి కార్జున కవిగారు సందేశములను చదివిరి.

శ్రీయుతులు కోడూరి శ్రీరాములు, సమ్మాని వెంక టప్పయ్యశాస్త్రి, కోగంటి దుర్గామల్లికార్జునకవి, మల్లంపల్లి రామలింగేశ్వరశర్మ, పింగికంటి అన్నపూర్ణమ్మ కోట సీతా రామశర్మ, మందుల కోటయ్యగార్లు శ్రీ సత్యనారాయణగారి గ్రంథములను కొనియాడారు.

ఆస్థానకవి పదవి రాష్ట్ర ప్రభుత్వమువారిని, భారత రత్న బిరుదము నొసంగ కేంద్ర ప్రభుత్వమువారిని అభ్యర్థించుచు తీర్మానించారు. శ్రీ దుర్గామల్లికార్జునరావు గారు వందన సమర్పణ చేశారు.

౦ ౦ ౦

బండారు తమ్మయ్యగారి జయంతి

భారతీ సమితి ఆధ్వర్యమున గ్రాంధి గ్రంథాలయంలో 1971 వ సంవత్సరం సెప్టెంబరు 26 వ తేది సాయంకాలం విమర్శకాగ్రేసర, ధర్మభూషణ, శివశ్రీ, శైవసాహితీ సార్వ భౌమ శ్రీ బండారు తమ్మయ్యగారి జన్మదినోత్సవం జరిగింది. శ్రీ మల్లంపల్లి రామలింగేశ్వరశర్మగారు సభాధ్యక్షత వహిం చారు. శ్రీ కనకదండిల విఠల్ శాస్త్రిగారు దైవప్రార్థన చేశారు.

శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునకవిగారు సందేశములను చదివిరి.

శ్రీయుతులు సుంకర శివరామయ్య, కోగంటి దుర్గామల్లికార్జునకవి, ఉప్పలూరి నాగభూషణరావు, కోడూరి శ్రీరాములు, గుళ్లపల్లి రామబ్రహ్మంగార్లు శ్రీ తిమ్మయ్యగారి సారస్వత సేవను శ్లాఘించారు. శ్రీ దుర్గామల్లికార్జునకవిగారి వందన సమర్పణ చేశారు.

౦ ౦ ౦

కొప్పరపు సోదరకవుల శతావధాన

గ్రంథావిష్కరణ మహోత్సవము

1971 వ సంవత్సరము సెప్టెంబరు 29 వ తేది సాయంకాలము కృష్ణాజిల్లా గ్రంథాలయ సంస్థ శాఖా గ్రంథాలయంలో ఆశుకవి చక్రవర్తులు కొప్పరపుసోదరకవుల శతావధాన గ్రంథావిష్కరణ మహోత్సవము భారతీసమితి యాధ్వర్యమున జరిగినది. శ్రీ నూాగపనేని వేణుగోపాలరావు ఎం. ఏ. గారు సభాధ్యక్షత వహించారు. శ్రీ కె. విఠల్‌శాస్త్రి గారు ప్రార్థన చేశారు. అధ్యక్షులు గ్రంథమునావిష్కరించి శతావధానులయిన శ్రీ కొప్పరపు సోదర కవులను శతావధానమును ప్రచురించిన శ్రీ కోగంటి దుర్గామల్లికార్జున కవిగారిని ప్రచురణార్థము శతావధాన గ్రంథము నొసంగిన శ్రీ కొత్త భావయ్య చౌదరిగారిని కొనియాడారు.

సభ జయప్రదముగా జరుగగోరుచు పెద్దలు పంపిన సందేశములను శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావుగారు చదివి

శతావధాన కృతిని ప్రచురింపవలసిన యావశ్యకతను వివరించారు.

శ్రీయుతులు కొవ్వూరి కామేశ్వరరావు బి. ఏ, బియల్, భాషాప్రవీణ మల్లంపల్లి రామలింగేశ్వరశర్మ, నూతులపాటి రాఘవరావు ఎం. ఏ. ఉప్పులూరి నాగభూషణరావు, కోడూరి శ్రీరాములు తుమ్మలపల్లి శివరావుగార్లు కొప్పరపు కవులను, శతావధాన కృతిని ప్రశంసించారు. శ్రీ దుర్గామల్లికార్జునకవి గారు వందన సమర్పణ చేశారు.

o o o

మహాత్మాగాంధి 102 వ జయంతి

1971 వ సంవత్సరం అక్టోబరు 8 వ తేది సాయంకాలము గ్రంథాలయసంస్థ (గాంధీ) గ్రంథాలయములో పూజ్య బాపూజీ 102 వ జన్మదినోత్సవం భారతీసమితి ఆధ్వర్యమున జరిగినది. విద్వాన్ శ్రీ నేమాని వెంకటప్పయ్యశాస్త్రిగారు సభాధ్యక్షత వహించారు. శ్రీ కె. విఠల్ శాస్త్రిగారు దైవ ప్రార్థన చేశారు.

శ్రీయుతులు కోగంటి దుర్గామల్లికార్జునకవి, కోడూరి శ్రీరాములు, సుంకర, శివరామయ్య, గుళ్ళపల్లి రామబ్రహ్మం చింతాల జగన్నాథగుప్త, ఉప్పులూరి నాగభూషణరావు, విన్నకోట రామలింగేశ్వరుడుగార్లు మహాత్మాగాంధి విశాల భావములను శ్లాఘించారు. శ్రీ దుర్గామల్లికార్జునకవిగారు వందన సమర్పణ చేశారు.

o o o



శ్రీ వేములపల్లి రామకృష్ణారావు



శ్రీ అరజా నాగేశ్వరరావు

## కవిసార్వభౌమ శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి
# 106 వ జన్మదినోత్సవము

1971 సంవత్సరం అక్టోబరు 24 వ తేదీ సాయంకాలము భారతీసమితి ఆధ్వర్యమున కృష్ణాజిల్లా గ్రంథాలయసంస్థ శాఖా గ్రంథాలయములో మహామహోపాధ్యాయ, ఆంధ్ర భాషాకవి, కవిసార్వభౌమ శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారి 106వ జన్మదినోత్సవము జరిగినది. శ్రీ పదుళ్లపర్తి రామ కృష్ణమూర్తి ఎం. ఏ. గారు సభాధ్యక్షత వహించిరి. చిరంజీవి కె. కృష్ణమూర్తి దైవప్రార్థన చేసెను.

శ్రీయుతులు గుత్తా వీరరాఘవులు బి. ఏ, బి ఇడి (రిటయిర్డు హైస్కూలు హెడ్మాష్టరు) విద్వాన్ కోగంటి దుర్గామల్లికార్జునకవి, కోడూరి శ్రీరాములు (రోడ్ ఇన్‌స్పెక్టరు) ఉభయ భాషాప్రవీణ సుశర్మ శివనామమ్మ, సింగి కంటి అన్నపూర్ణమ్మ, విన్నకోట రామలింగేశ్వరుడు ఎం. ఏ గార్లు శ్రీ కృష్ణమూర్తిశాస్త్రిగారి యపారమయిన భాషా సేవను కొనియాడిరి. శ్రీ దుర్గామల్లికార్జునకవిగారు వందన సమర్పణ చేసిరి. సభకు పూర్వం శ్రీ సీతావివాహము జరిగినది.

o o o

## గుడివాడ గ్రామోద్యోగుల మహాసభ

1950 వ సంవత్సరము జనవరి 28 వ తేదీన 1 గంటకు ఉపద్రష్టవారి సత్రములో శ్రీ హనుమంతరావుపేర్నీడుగారి అధ్యక్షతను గుడివాడ గ్రామోద్యోగుల మహాసభ జరిగినది. సభా

కార్యక్రమములు జరిగిన పిమ్మట ముందు సంవత్సరమునకు శ్రీ కాకరాల భాస్కరరావుగారిని అధ్యక్షులుగాను శ్రీ బొడ్డు పాటి లక్ష్మీసుబ్బారావుగారిని ఉపాధ్యక్షులుగాను యల్లంరాజు హనుమంతరావుగారిని కార్యదర్శిగాను ఎన్నుకొనిరి.

## సాహిత్య స్వర్ణోత్సవము

1965 వ సంవత్సరము, అక్టోబరు 5 వ తేది విజయ దశమి సాయంకాలము 5 గంటలకు పామర్రు భారతీసమితి ఆధ్వర్యమున గుడివాడలో, అభినవ రుద్రకవి శ్రీ చెలుకూరి కాళహస్తీశ్వరశర్మగారి సాహిత్య స్వర్ణోత్సవము జయప్రద ముగా జరిగినది.

శ్లో॥ విద్యా౽వినయ సంపన్నః
విశేషోపజ్ఞ గుణాన్వితః
కాళహస్తీశ్వరో జీయాత్
విశుద్ధ జ్ఞానవారిధిః॥

తట్టా నరసింహాచార్యః, సాహిత్య శిరోమణిః, బి. ఏ.,
సంస్కృత కళాశాలా, చిట్టిగూడూరు,

శ్లో॥ సదాశివస్సదా పాయాత్
కాళహస్తీశ్వరం కవిం
శివప్రదాతా విశ్వేశః
సచ్చిదానంద విగ్రహః॥

తర్క విద్యాగురుః సోమయాజుల పురుషోత్తమశాస్త్రి,
విద్వాన్ తెలుగు పండితుడు, హిందూహైస్కూలు,
గాంధినగరం, విజయవాడ.

శ్లో॥ ఆరోగ్యం దీయతాం దేవః
సుదీర్ఘం సుస్థిరం సదా
అహో, భవతః పాండిత్య
మగాధమతి నిర్మలమ్॥

ఏ. నరసింహాచార్యః, సాహిత్య శిరోమణిః, విద్వాన్
తెలుఁగు పండితుఁడు, కృష్ణాజిల్లా పరిషత్తు హైస్కూలు,
పామఱ్ఱు.—

ఉ ఈశ్వరభక్తి భావమున కెంతయుఁదోడుగ దేశభక్తి యున్
శశ్వదుపాస్తిగాఁ బ్రతుకుసైచిన శ్రీ చెలుకూరి కాళహా
స్తీశ్వరశర్మ కీర్తి వెలయించెను స్వర్ణజయంతి నేఁతనా
యాశ్వభినందనక్రియకు సంస్థ తి గూర్చిన కైత మేల్మిచే॥

కవిసమ్రాట్, కళాప్రపూర్ణ విశ్వనాథ సత్యనారాయణ
మారుతీనగర్, విజయవాడ

కం॥ చెలుకూరి కాళహస్తీ
శ్వర శర్మకవీంద్ర! మీదు స్వర్ణజయంతి
స్ఫురణము నేమొనగూర్చిన
పరమాదర పూర్వకాభినందనములివే॥

చోడవరపు సుబ్రహ్మణ్యావధాని, వెంట్రప్రగడ

తే॥ కావ్య నాటక శాస్త్రిముల్ కలయఁజదివి
కృతులను రచించి వాణినర్చించినాత్మ
షష్టిపూర్తి స్వర్ణజయంతి జరిగె నీకు

ఓ అభినవ రుద్రకవి! ధన్యుఁడవు నీవు॥

పి. రామకృష్ణారావు, టీచర్, కృష్ణాజిల్లా పరిషత్తు
హైస్కూలు, గూడూరు.

కం॥ నచ్చియు రాని పలుకులన్
నచ్చెనొ, నచ్చదొ యనుచు మనమునఁ దలఁపకే
యిచ్చెద వందన సుమముల
గ్రుచ్చి కవీశ్వర! యిదె కైకొనుము సహృదయతన్॥

కోకా మాధవరావు బి. ఏ., బి. ఇడి., కృష్ణాజిల్లా పరిషత్తు
హైస్కూలు, మల్లవోలు.

మ॥ అవతారం బనియెన్ను "పూర్ణపురుషుండౌ" గాంధి ఆదర్శ సి
ద్ధ్యదివదిన్ జూపిన శీలకవిత సమస్యల్నించు సత్సంప్రదా
యవిశిష్టస్థితి, గొప్పదేశభక్త రచనా వ్యాప్తి గావించినా
వవురా! భావము సేన, మానుటలు కొమ్మా హాళహేస్తీశ్వరా!

భక్తకవి బొచిమంచి శ్రీహరిశాస్త్రి, బొచిమంచివారిపాలెం

కం॥ పంచాశద్వర్షంబులు
ప్రాంచద్గతి సాహితీ సమర్చనమునుగా
వించిన నీకిదె నతుల
ర్పించెదను, నభినవ రుద్ర బిరుదాంకకవీ!

నిమ్మగడ్డ రామకోటేశ్వరశాస్త్రి, కొప్పూరు హైస్కూలు
గుంటూరు జిల్లా

తే॥ విద్యలకుఁదల్లి తనయింట వెలసెననఁగ
[illegible]
ఇదె గ్రహింపుము [illegible] కాళహస్తీశ్వరంబ!
హృదయ పుష్పాంజలిన్ సమర్పించువాఁడ॥

కోడూరి శ్రీరాములు, గుడివాడ

తే॥ ఏబదేండులు మీ కైతవేపు మీటి
పండితుల మెప్పు వడయుచుఁ బసిఁగినగడె
సరస సాహిత్య సంస్కార సాంద్ర! కొనుము
ఇవె నమస్సులు, కాళహస్తీశ్వరాంక!

ఘంటసాల చలపతిరావు, బందరు.

శ్లో॥ వేలుమూరి కాళహస్తీ
శ్వర శర్మాభిధన శ్రీకవి బుధాంకః
సాహిత్యసింధుః శ్రీమాన్
జీయాత్ పరమేశ్వరానుగ్రహ దృష్ట్యా॥

పావులూరి నాగబ్రహ్మచార్యః, తర్క వ్యాకరణ
వేదాంత విశారదః, రిటైర్డు హుజూర్ ఎకౌంటెంట్,
మచిలీపట్టణము

శ్లో॥ శ్రీమన్కవే! సంస్కృతాంధ్ర
హిందీభాషా విశారద!
కాళహస్తీశ్వరాభిఖ్య!
స్వస్త్యస్తు, భవత్ సదా॥

## చెఱుకూరి వేంకటసుబ్బయ్య, యార్లగడ్డ

o o o

## శ్రీ చింతలపాటి పట్టాభిరామశాస్త్రి

కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా చౌటపల్లి గ్రామమునందు శ్రీ చింతలపాటి రామచంద్ర శాస్త్రిగారు నివసించెడివారు. రామచంద్ర శాస్త్రిగారికి, పట్టాభి రామశాస్త్రి, గంగాధరశాస్త్రి, ఘంటయ్యశాస్త్రి, వేంకటసుబ్బయ్యశాస్త్రి యను నలుగురు కుమారులును, కామేశ్వరమ్మ, శేషమ్మయను నిద్దఱు కొమార్తెలును జన్మించిరి.

జ్యేష్ఠ పుత్రుఁడయిన పట్టాభిరామశాస్త్రిగారు చౌటపల్లిలో 1886 వ సంవత్సరము జూన్ 6 వ తారీఖున జన్మించిరి. 1896 వ సంవత్సరము వైశాఖమాసములో నుపనయన మహోత్సవము జరిగినది. 1897 వ సంవత్సరము వైశాఖమాసములో వివాహము జరిగినది.

రామానుజయ్య (సాతాని)గారియొద్ద రెండవ తరగతి వఱకు చౌటపల్లి ప్రాథమిక పాఠశాలలోఁ జదివి యనంతరము తండ్రిగారి దగ్గఱ నైషధాంతమువఱకుఁ జదువుకొనిరి.

అంగలూరునందలి ఎలిమెంటరీ హైస్కూలులో 1898 వ సంవత్సరములోఁ బ్రవేశించిరి. ఆ పాఠశాలలో శ్రీ చిల్లరిగి వేంకటరమణయ్య పంతులుగారియొద్ద నింగ్లీషక్షరాభ్యాసము జరిగినది. ఇంగ్లీషు చదువుచుండఁగా వేంకటరమణయ్య పంతులుగారు బదిలీయయిరి. వారి స్థానమున వచ్చిన

శ్రీ భాగవతుల వేంకటసుబ్బయ్యగారియొద్దజనుప్రాని ట్రైయినింగునకు వెళ్ళి గవర్నమెంటు పరీక్షయందు తీర్ణులైరి అంగలూరులో విద్యాభ్యాస సమయమున సహాధ్యాయులలో శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరిగారొకరు.

కుమారుని చిన్న కొండకంగలూరు గ్రామమునకు వెళ్ళి అంగలూరులో 1 1/2 సంవత్సరములు త్రిపురనేని గోపాలకృష్ణయ్య, త్రిపురనేని నరసయ్య, దుగ్గిరాల పురుషోత్తం, నల్లగిరి శేషగిరిరావు ప్రభృతులకు రామచంద్రశాస్త్రిగారు సంస్కృతమును నేర్పిరి.

పట్టాభిరామశాస్త్రిగారు 1898 వ సంవత్సరము డిశంబరులో ప్రైమరీ పరీక్షయందును 1901 వ సంవత్సరము డిశంబరులో గవర్నమెంటు లోయర్ సెకండరీ పరీక్షయందును తీర్ణులయిరి. 1902 వ సంవత్సరము బందరు హిందు హైస్కూలులో ప్రవేశించిరి. 1904 వ సంవత్సరము వరకును చదివిరి. 1904వ సంవత్సరము డిశంబరులో జరిగిన మెట్రిక్యులేషన్ పరీక్షకు జబ్బు చేయుటవలన వెళ్ళలేదు 1905 సం॥ము. లోపించిని బరీక్షకు బోలేదు 1906వ సంవత్సరములో బరీక్షకు వెళ్ళిరి. కాని తప్పిపోయిరి. 1907వ సంవత్సరములో గూడ తప్పిపోయిరి. 1908 వ సంవత్సరములో గ్రూప్పు సబ్జక్టులో మాత్రము తీర్ణులయిరి. 1909 వ సంవత్సరములో, ఫిబ్రవరిలో ఓ ఎగ్జామినేషన్ జరిగినది. దానిలో గూడ విజయమును బొందలేదు.

1909 డిశంబరు నెలాఖరువరకును, గుడివాడ తాలూకా కోడూరు పాఠశాలలో, ఆక్టింగ్ హెడ్మాష్టరుగా బని చేసియుండిరి. తరువాత గుడ్లవల్లేరు బోర్డు పాఠశాలలో నాల్గు



శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి



శ్రీ వెంపరాల చినరామస్వా

మాసముల వఱకుఁ బనిచేసిరి. 1910 వ సంవత్సరములో గుంటూరు గవర్నమెంటు ట్రెయినింగు స్కూలులోలోయర్ సెకండరీ ట్రెయినింగు ప్యాసయిరి. 1911 వ సంవత్సరములో, కైకలూరు తాలూకా కొల్లేటిపట్లు, సీతనపల్లి గ్రామములలోఁ బనిచేసిరి. శ్రీ రాజా వేంకటరామయ్యగారి తమ్మునికిని, పంట్రంగి త్రియంబకరావు మొదలయిన వారి పిల్లలకు నింగ్లీషును సంస్కృతమును జెప్పిరి. 1912 వ సంవత్సరములో, పెదపాలపఱ్ఱు బోర్డు హైస్కూలులోఁబనిచేసిరి, 1914 వ సంవత్సరములో, చౌటపల్లి బోర్డు హైస్కూలులో, అసిస్టెంటు టీచరుగాఁబనిచేసిరి 1914 వ సంవత్సరము నవంబరు 29 వ తేదివఱకు, చౌటపల్లి గ్రామములోనే పనిచేసిరి. 1914 సంవత్సరము నవంబరు 30 వ తేది లగాయతు, ఏలూరు సి. యం. యస్. హైస్కూలులోఁ దెలుఁగు పండితులుగాఁబనిచేసిరి. అపుడు వేతనము నెలకుఁ బదునయిదురూపాయలు మాత్రము. (ట్రాన్సులేషన్ గూడ జెప్పెడివారు) 1920 వ సంవత్సరము. అక్టోబరు 1 వ తారీఖున, కైకలూరు మిడిల్ స్కూలులోఁ దెల్గు పండితులుగాఁ బ్రవేశించిరి 1924 వ సంవత్సరము, ఏప్రియల్ 24 వ తారీఖున గుడివాడ బోర్డు హైస్కూలులో జూనియరు తెలుఁగు పండితులుగాఁ జేరి క్రమముగా నాయున్నత పాఠశాలలోనే ప్రధానాంధ్ర పండితులుగాఁబనిచేసిరి. 1935 వ సంవత్సరము అక్టోబరులో, కన్నుగనఁబడకపోవుటవలన సెలవుపెట్టి తెనాలిలో డాక్టరు శ్రీ వెంపటి సూర్యనారాయణ గారియొద్దకేగి యాపరేషను జేయించుకొనిరి 1938 వ సంవత్సరము నవంబరులో రిటయిరు పెట్టిరి. సంస్కృతమును నాట

కాంతము వఱకును జదివిరి. 1906, 1907 సంవత్సరములలో బందరులోనుండి యింగ్లీషు పరీక్షకుఁ బోవుట మానినపుడు బందరు హైస్కూలుపండితులయిన శ్రీ పరిమి నరసింహశాస్త్రి గారి దగ్గఱఁ గౌముదిని జదివిరి.

గుడివాడలోని సత్యనారాయణ పురమునందుఁ జెంగల కోడు సమీపమున 1928 వ సంవత్సరములో నొక గృహమును నిర్మింపఁజేసిరి. 1915 వ సంవత్సరములో గుడివాడలో నివేశ స్థలమును పొలమును గొనిరి. వైదిక కర్మనిష్ఠాపరులు కోగంటి దుర్గామల్లికార్జునరావుగారు వీరి శిష్యులలో నొకరు. 1933 వ సంవత్సరము ఫిబ్రవరిలో నొక పిల్లవానిని దత్తత చేసికొని [illegible] యతనికుపనయనము చేసిరి.

శ్రీ పట్టాభి రామశాస్త్రిగారి ప్రసంగము.

విద్య నేర్చుకొనుటకు మనస్సును సరియయిన స్థితిలో నుంచుకొనవలయును. ప్రతి విషయమును గ్రహించుచుఁ బ్రతి వాక్యమును బ్రతి పదమును గమనించుచుఁ జదువవలయును. ఎందువలననఁగాఁ బ్రతిపదము పుట్టి యనేక రూపాలలో మాఱుచు ననేకార్థములను గలిగియుండును. ప్రతిపదమునకు సరియయిన యర్థము, దానిరసము, భావము కాయను బొటలఁ గొట్టి దానిలోని వస్తువే విధముగాఁ దీసికొందురో యామాదిరి గానే ప్రతిపదమును, ముక్కలు చేసి, చీల్చి తీసికొనవలయును. విద్య నేర్చుకొనువారు తగిన శ్రద్ధ వహించి కష్టపడి చదువు కొనవలయును.

కష్టముకొలఁది ఫలితమును లాభమును బొందుదురు. అరేబియాలో నొక కవి హాటంత్ అలీయనువాడు, అరబిక్ భాషలో విద్యను గుఱించి కొన్ని యుదాహరణము లిచ్చి యున్నారు. కష్టముకొలఁది దర్జాలు పంచఁబడును. ఎవరు పెద్ద దర్జాను గోరుదురో వారు రాత్రులు మేలుకొనవలయును. మీరు హాయిగా నిద్రపోవుదురు. పెద్దదర్జా కావలయునందురు. ఎవరికి ముత్యమవసరమో వారే సముద్రములో మునుఁగుదురు. ఎవరు కష్టము చేయకుండఁ బెద్ద దర్జా కావలయునను వాంఛతో నుందురో వారు వ్యర్థమయిన కోరికలతో, తమ కాలమును వృథా చేసికొన్నవారగుదురు. కాఁబట్టి యీ పైనఁ జెప్పినటువంటి వాక్యముల ప్రకారము ప్రతి విద్యార్థి విద్యనుగూర్చి తగిన శ్రద్ధ వహించి కష్టపడి నేర్చుకొనవలయును. సంచిని పుస్తకములను వేసికొని యింటినుండి బడికి, బడినుండి యింటికి మోసి చివరకు విద్య లభింపక పోయిన యెడల నా విద్యార్థి బరువు మోయుటకుఁ గాడిదతో సమానమగును. విద్య స్వభావసిద్ధముగా మనుష్యుని గుణవంతునిగాఁ జేయును. గౌరవమును గలిగించును, చాలామంది విద్యార్థులు, విద్యనెట్లు నేర్చుకొనవలయునో తెలిసికొనక మూర్ఖులుగాఁ బ్రవర్తించుచున్నారు. విద్యనెట్లు నేర్చుకొనవలయునో దానివలన మంచిగుణాలెట్లు పొందవలయునో ప్రతి విద్యార్థి తెలిసికొనవలయును. పశువులకు, మానవులకుఁ దెలివి, విద్యయే భేదము. ఈ భేదములేని యెడలఁ బశువులును మనుష్యులును సమానమని చెప్పవలసి వచ్చును.

# దేవినేని సూరయ్యగారి సన్మానము

పామర్రు భారతీ సన్మాన సంఘము తరఫున శ్రీ దేవినేని సూరయ్యగారికి సమర్పింపఁబడిన సన్మానపత్రము.

పండితవర్యా!

ప్రాథమిక మాధ్యమికోన్నత పాఠశాలలయందు విద్యార్థులకుఁ బాఠములను జక్కఁగా బోధించి విద్యార్థుల మన్ననలకుఁ బాత్రులయితిరి. శ్రీ చల్లపల్లి రాజా యార్లగడ్డ శివరామప్రసాద్ బహద్దరుగారి యున్నత పాఠశాలలోఁ బండితులుఁగాఁ బని చేయుచున్న మీరు 1942 వ సంవత్సరములో, పండిత పదవినుండి విరమించితిరి. రాజా శ్రీ శివరామప్రసాద్ బహద్దరుగారి వివాహ మహోత్సవ సందర్భమున జరిగిన కవితా గోష్ఠులను కవి సన్మాన సభయును నిరంతరాయముగా మహానంద దాయకములుగా మీ ప్రయత్నము వలననే నెఱవేఱినవని చెప్పుట యథార్థము.

కవివర్యా!

చల్లపల్లిలో జరిగిన మీ షష్టిపూర్తి మహోత్సవ సందర్భమున మీరు పౌరులచే ఘనముగా సన్మానింపఁబడితిరి. కుమారబోధిని, దశావతార చరిత్ర, హనుమదభ్యుదయము, చిత్రకర్ణోదంతము, తులసీదేవి చరిత్ర, వీరరసపుత్రీయము, భగవదనుమతము, ధ్రువ చరిత్రేత్యాది గ్రంథములను రచియించి, భాషాసేవ గావించి కీర్తి నొందితిరి. మీ కీర్తిలత యుగాంతము వఱకు నుండుఁగాక

ఇట్లు, భారతీ సన్మాన సంఘము, గుడివాడ, 21-8-64.

## శ్రీ శ్రీరాం వీరబ్రహ్మకవిగారి జన్మదినోత్సవము

పామర్రు భారతీసమితివారి యాజమాన్యమున గుడివాడటవున్ హైస్కూలునందు, కవిరత్న, ఆంధ్ర భాషావాచస్పతి, సహస్రావధాని శ్రీ శ్రీరాం వీరబ్రహ్మకవిగారి 81 వ జన్మదినోత్సవము జరిగినది. వీరబ్రహ్మకవిగారా సమయంబున సభాధ్యక్షులు మన్నగు వారిని గుఱించి చెప్పిన పద్యములు—

(1) అధ్యక్షులు సాహిత్యభూషణ వేదము రామప్రభువు,

యం. ఏ. యల్. టి. గారిని గుఱించి –

కం॥ వేదండయానా! శ్రీయుత
వేదము రామప్రభువుల వేదము నగని రా
వే, ఇండి తాసురాళీ!
వేదండాననునిమాతి! వేదాతీతా!

(ఇంకను 6 పేలు సమర్పింపబడినవి.)

కం॥ వేదము రామప్రభుగారిం
పే, దయసభ కధిపతులగుట నెంతయుమదిరా
మోదంబయ్యెను వారికి
నాదగు వందన శతం బొనర్తును బేర్మిన్॥

2 ఉపన్యాసకులను గుఱించి

కం॥ ఈసు వహింపక కవితన్
దోసంబుల నెన్నక పరితోషమును నుప
న్యాసంబుల నిడిన యుప
న్యాసకులకు వందనములొనర్తును వేడ్కన్॥

3 సభికులను గురించి

కం॥ హృదయ స్థితాత్మ లోక నయ
సిదియది. యని, కులమతంబు లివిలయవియని తే
లిది యెఱుఁగు విజ్ఞులకు ముద
మొదవ నమస్కృతులొనర్తునిదే బుధులారా!

4 కార్యకర్తలను గురించి

కం॥ మీరీ జనోత్సవమును
దారమతి నొనర్పఁ దత్కృతజ్ఞతఁ దెలుపన్
నేరమి మీ కీర్తులు సమ
స్కార శతమొనర్తుఁ జేర్మిఁ గైకొనుఁడు బుధుల్॥

సీ॥ జాస్తి వంశ జలధి చంద్రుండు వేంకట
నరసయాహ్వయుండు, సరసహృదయుఁ
డీసు లేక భారతీసంస్థ సత్కవి
గౌరవం బొనర్చు కౌతుకంబు

సలుప చూపుఁ గాని, జాస్తి వచింపఁడు
ఎట్టి ధన్యమతియొ? యట్టివాని
సభినుతింతు మత్కృతాభి వందనములఁ
గూర్మిఁ జేకొనంగఁ గోరువాఁడ॥

5 సంఘ కార్యదర్శి, స్వాగతోపన్యాస కర్తలను గురించి

కం॥ శ్రీకరులు మధురకవి కవి
కోకిల, కాకాని, సుకవి కొగంటి కవుల్

మీాకసుత శతాయువు, దు
ర్గా కృప నరసింహా మల్లికార్జున రాయల్॥

కం॥ ఛాత్రులరో కవ్వా డిపుడు ప
విత్రాశయుమొప్ప నాకు వేడ్క ఘటింపన్
బాత్రులఁగ్రైకొని నా స్తుతి
పాత్రులరై తిరి శుభంబభవుఁడిడుతండయున్॥

కం॥ శ్రీమత్కోగంటి పవి
త్రామల వంశాబ్ధి చంద్రుఁడనఁదగు శ్రీ దు
ర్గా మల్లికార్జున కవిన్
గామితమిడి శంకరుండు గావుత నిచ్చల్॥

6 సందేశములంపిన వారిని గుఱించి

కం॥ సందేశముఁలంపిన హితు
లందఱకును నా కృతజ్ఞతాత్మక మగునా
నందము నవవందనంబుల
నందించుచుఁ జేకొనంగఁ బ్రార్థింతురహిన్॥

7 ఇష్టదేవతా న భాధిపతుల నామాంకితాద్యంత
చరణములుగల సంస్తుతి

ఆ॥ రామచంద్ర పూత రఘువంశ నృపవరా!
జమను రూపమారి! కరుణను గనుము
ప్రణమితాఖిల ప్రపంచైక వినుత ప్ర
భుఁడవు కొల్తు నిన్ను భూసురవిభు!



శ్రీ త్రిపురమల్లు లక్ష్మయ్యగుప్త



శ్రీ కరెడ్ల నరసింహం

శ్రీ బుగ్గా పాపయ్యశాస్త్రి

క॥ శ్రీ ధరణి కోట వంశాం
భోధి శశీ! వెంకయార్య బుధనుత కీర్తి
శ్రీ ధామ ! మిమ్ము మా హృద
యాధిపు( జెపుదో ముకన్ శతాయువు నిడుచున్

*    *    *

## సుందరం గ్రామోద్యోగియ కళాశాల 28వ వార్షికోత్సవము, గుడివాడ.



1952 వ సంవత్సరము డిశంబరు 1 వ తేది సాయంకాలము 4 గంటలకు మునిసిపల్ హైస్కూలులో డిప్యూటీ కలెక్టరు శ్రీ యల్. మాలకొండయ్య యం. ఏ గారి అధ్యక్షతను సుందరం గ్రామోద్యోగియ కళాశాల 28 వ వార్షికోత్సవము జరిగినది. శ్రీ కొండపల్లి గోపాలకృష్ణారెడ్డి ప్రార్థనా గీతములతో సభా కార్యక్రమము ప్రారంభమయినది. సభకు గుడివాడ తహశ్శీలుదారు శ్రీ కోటంరాజు కామేశ్వరరావు శ్రీ రివిన్యూ ఇన్‌స్పెక్టరు మొదలగు ప్రముఖులు విచ్చేసిరి. ఆహ్వాన సంఘాధ్యక్షులు చాపరాల శేషగిరిరావు గారు తమ స్వాగతోపన్యాసములో గ్రామోద్యోగియుల హక్కులను గురించియు, కళాశాల చేయుచున్న పనిని గురించియు, కళాశాలాభివృద్ధికి కావలసిన సహాయమును గురించియు వివరించిరి మేనేజరు శ్రీ బి. యల్. సుబ్బా

రావు గారు ఇట్లు ప్రసంగించిరి. 1925వ సంవత్సరములో కళాశాల స్థాపింపబడినది. 1925 వ సంవత్సరము నుండి 1951వ సంవత్సరము వఱకును జాతి, మత, కుల, వర్గ, లింగ భేదములు లేకుండ గ్రామీణులకు గ్రామోద్యోగులకు శిక్షణ యీయ బడినది. హాజరయిన 7197 మందిలో 6961 మంది ఉత్తీర్ణులయినారు. 4130 మంది విద్యార్థులలో 1883 మందికి నిండు జీతము. 1671 మందికి అర్ధజీతము 577 మందికి ఉచిత విద్య. జిల్లా మొత్తము మీాద హాజరగు విద్యార్థులలో ఎక్కువ మంది విద్యార్థులే. కళాశాల 1, 2 క్లాసులలో ప్యాసయినారు.

కళాశాల స్థాపకులను, ప్రధానాధ్యాపకులునయిన శ్రీబొడ్డపాటి పూర్ణసుందరరావు గారికి కళాశాల విద్యార్థులు ప్రశంసా పద్యములను సమర్పించిరి. స్థాపకుల జీవిత సంగ్రహమును, కళాశాలావశ్యకతను ప్రజలును ప్రభుత్వమును గుర్తించి పంతులుగారికి సర్వ విధముల తోడ్పడవలెనని శ్రీ యస్. వి. యస్. ప్రసాదరావు, హైస్కూలు హెడ్మాష్టరు శ్రీ గుత్తా వీరరాఘవులు, విద్వాన్ శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావు, శ్రీ నిడమర్తి సత్యనారాయణమూర్తి గార్లు మొదలయిన వారు తమ యుపన్యాసములలో సూచించిరి. కళాశాల పూర్వ విద్యార్థి సంఘము తరపున జంధ్యాల రామసుబ్రహ్మణ్యశాస్త్రి గారు తీర్మానములను ప్రవేశ పెట్టిరి. పిమ్మట శ్రీ సుందరరావు గారిట్లు ప్రసంగించిరి.

"ఈ కళాశాల కేవలం పల్లెటూరి ప్రజలను విద్యావంతులుగా చేయుటకును, పాడుపడియున్న పల్లెలను పునరుద్ధరించుటకును, గ్రామోద్యోగీయులకును, గ్రామీణులకును ఉన్న

పరస్పర విరుద్ధాశయములను పాఱద్రోలి సహకార ప్రయత్నముతో, సోదర భావముతో అందఱును మెలగుటకును స్థాపింపబడినది. నేటి వఱకు కళాశాల అభివృద్ధి గాంచుచున్నను కళాశాలకు భవనము, లేకపోవుట తీరని కొఱతగా నున్నది. అందుకుగాను గుడివాడలో స్థలమును మంజూరు చేయించుట అత్యవసరము. ఇదిగాక గ్రామీణులందఱును సర్వేయందు ను త్తీర్ణులగుటకు ప్రభుత్వపు క్లాసులు సరిగా పని చేయుట లేదు. కరణం పరీక్ష మాదిరిగానే దరఖాస్తు ఫీజును కట్టించి ఉన్నతాధికారిచే పరీక్ష చేయించి సర్టిఫికెట్లు ఇప్పించిన ప్రభుత్వమునకును ప్రజలకును లాభసాటి.”

అనంతరము సభాధ్యక్షులిట్లు ఉపన్యసించిరి “ఇటువంటి సంస్థను ఇంతవరకు నేను ఎక్కడ చూడలేదు. స్థాపకుల ప్రజాసేవ ప్రశంసింపదగినది. కాలేజీని రికగ్నయిజు చేయించుకొన్న, స్థలము మంజూరు మొదలగు సదుపాయము లేర్పడగలవు సర్వే తరగతి ప్రయివేటుగా నుంచుటచే ఎక్కువ ఉపయోగకరమయినది. నా చేతనయినంత వరకు కళాశాలాభివృద్ధికి తోడ్పడెదను. పంతులుగారి షష్టి పూర్త్యుత్సవము జయప్రదంగా జరుగుటకు ఆశించుచున్నాను. అందఱితో పాటు నేను కూడ యథోచితంగా సహాయ పడెదను. పంతులు గారు ఆయురారోగ్య ఐశ్వర్యాభి వృద్ధిగా నుండుగాక.”

మేనేజరు శ్రీ లక్ష్మిసుబ్బారావుగారి యభినందనములతో సభా కార్యక్రమము ముగిసినది. సభకు పూర్వం తేనీటి విందు జరిగింది. గ్రూపు ఫోటో తీయబడింది.

—o—

# శలాక వేంకటశేషగిరిరావుగారు

---

1966వ సంవత్సరము ఫిబ్రవరి 2వ తారీఖున శ్రీ శలాక వేంకటశేషగిరిరావుగారు స్వగృహమునందు తమ ద్వితీయ పుత్రిక చి॥ సౌ॥ అన్నపూర్ణమ్మకు వివాహ మొనర్చిరి. తత్సందర్భమున శ్రీ కోడూరి శ్రీరాములు గారికి వేంకటశేషగిరిరావు గారు సన్మానము చేసిరి. శ్రీ రాములు గారు చదివిన పద్యములు.

ఉ॥ శ్రీయును, ఆయువున్ యశము శ్రేయముఁ గూర్చుచు నెల్లవేళలన్
ఆయత కీర్తి పుంజముల నాగతమున్ దిశలెల్ల నింపుచున్
పాయక యర్థి కల్పతరులాయని యెంచఁగఁ బేరు గాంచఁగన్
ఆయుమ ప్రోచుగాక! స్గన యానన దంపతులైన మిమ్ములన్॥

తే॥ పూవుఁ దావియుఁ బోలె నీ వృషభ యందుఁ
జంద్ర చంద్రికా భానంబు జాలువారు
రత్న బంగారు నేళన రాజిలంగ
దంపతులకు సచ్ఛ్రేయముల్ దనరుఁగాక।

కం॥ కలవారి యింట బుట్టిన
కులశీల విలాసవతియు గుణవతి యగు నీ
బాలంతుకయు నీవు నిరతముఁ
జిలుకయు గోర్వంక వోలెఁ జెల్మిని మనుఁడీ!

క॥ కావింపుఁడు ధర్మంబును
కావింపుఁడు దైవపూజ, కవులను మెచ్చన్
కావింపుఁడు దానంబును
కావింపుఁడు మంచి పనులు, కలియుగ మందున్॥

ఉ॥ తప్పును నేను నొక్కటనిచేసి గణించుచు ధీరయుక్తులై
భాషసుభాను భూతిఁగని పల్కుచు మెచ్చఁగసంచరించుచున్
భాషము లుప్పతిల్లఁగఁడుఁ బావనమూర్తులఁ గూర్మిబిడ్డలన్
దైవ బలమ్ముతోడఁ గని ధాత్రినిఁ గీర్తినిఁ గాంచుఁ
దివ్యులున్॥

* * *

# జాస్తి వేంకటనరసయ్యగారి 56వ జన్మదినోత్సవము

పామఱ్ఱు భారతీ సన్మాన సంఘాధ్వర్యమున 1966 వ సంవత్సరము, ఆగష్టు 2వ తేదీ సాయం కాలము 5 గంటలకు గుడివాడ టవున్ హైస్కూలులో, ఉభయ భాషా ప్రవీణ శ్రీ జాస్తి వేంకటనరసయ్యగారి 56వ జన్మ దినోత్సవము జరిగినది.

సాహిత్య వల్లభ, సరస కవితా విశారద, అభినవ రాయ, డాక్టరు శ్రీ అకునుమల్లి నారాయణరావు ఎం. బి. బియస్ గారు సభ కధ్యక్షత వహించిరి. శ్రీ సి. హెచ్.

జగన్నాథగుప్తగారు ప్రార్థన పద్యములను జదివిరి.

అధ్యక్షులు శ్రీ వేంకటనరసయ్యగారి దేశసేవను భాషా సేవను గొనియాడిరి. శ్రీయుతులు బండారు తమ్మయ్య, శ్రీ గాం వీరబ్రహ్మకవి, ఏనుగు తమ్మిరాజు, బాలా శివరామ రెడ్డి, చిర్రావూరు నాగభూషణాచార్యులు, షేక్ అలీ, చల సాని లక్ష్మినారాయణవర్మ, కోదూరి శ్రీరాములుగార్లు పంపిన గద్య పద్య సందేశములను శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావు గారు చదివిరి.

శ్రీయుతులు నందూరు వేంకటాచార్యులు, వి. సూర్య ప్రకాశరావు, కోగంటి దుర్గామల్లికార్జునరావు, కోట పద్మ నాభంగార్లు వేంకటనరసయ్యగారు సంస్కృతాంధ్రముల యందు సరళమయిన కవిత్వమును జెప్పగలరనియు, బాలగ్రంథములను రచించిరనియు నుపన్యసించిరి. ప్రధాన కార్యదర్శి శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావుగారు వందన సమర్పణ చేసిరి. అందఱును గలిసి జనగణమన గేయమును బాడిరి. ఆ యున్నత పాఠశాల లోని యుపాధ్యాయ సంఘము వారాతిథ్య మిచ్చిరి.

—o—

## శ్రీ అరజా నాగేశ్వరరావు

1944 వ సంవత్సరము, ఫిబ్రవరి 8వ తారీఖున కృష్ణా జిల్లా దివి తాలూకా పెదకళ్లేపల్లి గ్రామము నందు అరజా నాగేశ్వరరావుగారు జన్మించిరి. తల్లి వేంకటసుబ్బమ్మగారు

తండ్రి తిరుపతి రాయుడుగారు. పెదకళ్లేపల్లి గ్రామము నందలి ఎలిమెంటరీ స్కూలులోఁ బ్రవేశించి యయిదవ తరగతి వఱకును జదివిన తరువాత నా గ్రామము నందలి ఓరియంటల్ హైస్కూలులోఁ జేరి యస్ యస్. యల్. సి వఱకుఁ జదివిరి. అనంతరము గుంటూరు పట్టణము నందలి సంస్కృత కళాశాలలోఁ బ్రవేశించి నాల్గు సంవత్సరముల వఱకుఁ జదివి 1969వ సంవత్సరములో భాషాప్రవీణ పరీక్ష యందుత్తీర్ణులయిరి.

గుడివాడ టవున్ హైస్కూలులో 1969 వ సంవత్సరములోఁ బ్రవేశించి సెకండరీ గ్రేడ్ తెలుఁగు పండితులుగాఁ బనిచేయుచున్నారు. "శ్రీ వేంకటేశ్వర ఆంధ్ర వ్యాకరణము" అను గ్రంధమును రచించి ప్రచురించిరి. అరజా శతకము, మాకనల్లీపురమను గ్రంథములను గూడ రచించిరి. కాని యవి యముద్రితములు. నాగేశ్వరమ్మగారు శ్రీ నాగేశ్వరరావు గారి ధర్మపత్ని.

—o—

## నార్ల వేంకటేశ్వరరావుగారి షష్టిపూర్తిమహోత్సవము

శ్రీ పొట్టి శ్రీరాములు మునిసిపల్ హయ్యర్ సెకండరీ స్కూలులో 1969వ సంవత్సరము జనవరి 26వ తేదీ సాయం



శ్రీమతి ఇవటూరి మాణిక్యాంబ





శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ

కాలము, ఆంధ్రజ్యోతి పత్రికా సంపాదకులును రాజ్యసభా సభ్యులునగు శ్రీ నార్ల వేంకటేశ్వరరావుగారి షష్టి పూర్తి మహోత్సవము జరిగినది. ఆ సందర్భమున శ్రీ పామర్రు భారతీ సన్మాన సంఘము తరపున సమర్పింపఁ బడిన పద్య సన్మాన పత్రము.—

పత్రికాముఖ్య సంపాదక వర్య!
వేంకటేశ్వర రాయ! విబుధేంద్ర గేయ!
అప్పలాన్వయ కలశాబ్ధి చంద్రమాండు
సాంబశివుఁడు నేఁటి సభ కధినేత
యనుచుఁ జే నాసంగ సాహిత్యంత మయ్యె
నాహ్వాన పత్రిక యుంచఁగా నాకు
నానంద మెదలోన నందియున్నాఁడ.
ఆంధ్రాంగ్ల భాషల యందధికముగఁ
బాండిత్యమును సముపార్జించినావు
ప్రజ్ఞా విశేషమ్ముఁ బడసి యున్నావు
వ్యాసాలఁ బెక్కింటి వ్రాసియున్నావు
గ్రంథాలఁ గొన్నింటి రచియించినావు
గీతాలు లిఖియించి కీర్తి గన్నావు
సారస్వత సభలు జరిగిన చోట్ల
నధిపతి స్థానంబు నందియున్నావు
పలుచోట్ల సభలలోఁ బలికి యున్నావు
పలుకులో మాధురిఁ గలిగి యున్నావు
వ్రాఁతలో సొగసును బడసియున్నావు
జ్ఞానాభి వృద్ధికై చూచుచున్నావు

ప్రజలచే మన్ననల్ పడసియున్నావు
అన్య దేశాలకు నరిగి యున్నావు
అనుభవంబును గడునార్జించినావు
సంపాదకీయాలు చక్కఁగా వ్రాసి
శిరోమణీ ప్రశస్తులు చేసియున్నావు
సన్మాన మొనరించు సదవకాశమ్ము
గలుగఁగా హర్షమ్ముఁ గాంచి యున్నాఁడ
భాగ్యమియ్యది యంచు భావించినాఁడ
షష్టి పూర్తి మహస్సు జరుగుచునుండఁ
గోవిదులున్నట్టి గుడివాడ యందు
శారదా సన్మాన సంఘ మిదె నేఁడు
సద్భక్తితో నీకు సలుపు చున్నట్టి
యల్ప సన్మానమ్మునందు కోనయ్య
ఇదె పది వేలుగా నెంచుకోవయ్య
మొన లేని కరుణతో వీక్షింపుమయ్య
ఆర్యుల దీవెన లధికమౌఁ గాక!
పట్టిన దెల్లను బసిడియౌఁ గాక!
విశ్వాన నీ కీర్తి విలసిల్లుఁ గాక!
ఆయురారోగ్యమ్ము లబ్బును గాక!
ఎదలోని కోరిక లీడేఱుఁ గాక!
జోహార్లు జోహార్లు జోహార్లు నీకు॥

సుజనవిధేయుడు, కోగంటి దుర్గామల్లికార్జునరాయకవి
భారతీ సన్మాన సంఘకార్యదర్శి, పామఱ్ఱు, 26-1-1969

# శ్రీ కోదూరి శ్రీరాములు

---

1971 వ సంవత్సరము, ఏప్రియల్ 28 వ తేది యుద యమున శ్రీ కోదూరి హనుమంతరావుగారి జ్యేష్ఠ పుత్రుఁడును శ్రీ కోదూరి శ్రీరాములుగారి పౌత్రుఁడునగు చి॥ మధుసూదనప్రసాద్ అన్నప్రాశన మహోత్సవము హనుమంతరావుగారి గృహమునందు జరిగినది. ఆ సందర్భము నందాశీర్వాద పద్యములను జదివిన శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావుగారికిఁ జందన తాంబూలాదులను, బంగీత శాల్వాను శ్రీ కోదూరి శ్రీరాములుగారు సమర్పించిరి. శ్రీ కోగంటి దుర్గామల్లికార్జున రావుగారు చదివిన పద్యములు.—

కం॥ అన్న ప్రాశన మని ర
మ్మన్న సఖుఁడుఁ బత్ని యుల్లసిలుచుని, వచ్చితి నే
సన్న పదమ్మను దప్పక
కన్నారఁగఁ జూచి ముదముఁ గాంచితి వత్సా!

కం॥ పసయగు నీ యారోగ్యముఁ
బసయును జ్ఞానంబు మిగులఁ బ్రజలు నుతింపన్
బసఁగయును కడు నైశ్వర్యముఁ
బసయును ధీపాటవమ్ము వసుమతి యందున్॥

ఆ॥ గడన చేయు మెపుడుఁ గన్న తండ్రి విధమ్ము
పెద్దవాఁడవయిన పిదప నీవు
ముద్దుఁగోలుకు నట్టి పద్దెంబులను జెప్పు
ప్రీతితోడఁ జూచు తాత మూడి॥

ఆ॥ ఒక్క భాషగాక పెక్కు భాషల నేర్చి
కొనిన మేలు మిగుల నొనగు నంచు
ననుభవమ్మును గల యార్యులు వచియింత్రు
నీవు భాషలెన్నొ నేర్చుకొనుము॥

తే॥ అక్షరంబులు నేర్పిన యగనురాఁగ
నపుడు చనుదెంచి నేర్పెద నక్షరములు
నేను జీవించియుండిన, నేని నీకు
నమ్మ యియ్యది మధుసూదనప్రసాద !

—o—

## శ్రీమతి ఇనటూరి మాణిక్యాంబ

పశ్చిమగోదావరి జిల్లా చిట్టివరపు అను గ్రామము నందు 1948 వ సంవత్సరము సెప్టెంబరు 19 వ తారీఖున ఇనటూరి మాణిక్యాంబగారు జన్మించిరి. తల్లి శ్యామలాంబ గారు తండ్రి సుబ్రహ్మణ్యముగారు.

కడపయందు 1, 2 తరగతులు, మద్రాసు నందు 3వ తరగతి, అదవాని యందు 4, 5 తరగతులు, కోసగి యందు 6వ తరగతి, ఆదవాని యందు 7వ తరగతి, కాళహస్తి యందు 8, 9, 10 తరగతులు పెంటేకల్లు నందు యస్. యస్. యల్ సి, గుంటూరు నందు పి. యు. సి, గుంటూరు శారదా నికేతనములో భాషాప్రవీణ చదివిరి. 1971వ సంవత్సరములో రాజమండ్రి వెళ్ళి యుపాధ్యాయ శిక్షణ పొందిరి.

# గురుదక్షిణ

1964వ సంవత్సరము డిశంబరు 6వ తారీఖున భారతీ సమితి యాధ్వర్యమున గురుదక్షిణ సభ జరిగినది.

మహాశయా! నమస్కారములు.

శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావుగారు వారి గురువులైన శ్రీ శ్రీరాం వీరబ్రహ్మకవిగారికి గురుదక్షిణ సమర్పించుట వలన నాకు చాల ఆనందము గలుగుచున్నది. గురువుల యెడ భక్తియుక్తులై గురుదక్షిణ సమర్పించుట మన ప్రాచీన సాంప్రదాయమై యున్నది. తదనుగుణముగా శ్రీ దుర్గామల్లికార్జునరావుగారు ప్రవర్తించి మన ప్రాచీన సాంప్రదాయమును నిలబెట్టినందులకు నేను అపరిమితానందము నొంది వీరికి భగవంతుడు ఉత్తరోత్తరము ఆయురారోగ్యైశ్వర్యముల నొసంగుగాక యని కోరుచున్నాను. ఇట్లు, పేనుగు తమ్మిరాజు,

రాజమండ్రీ, 30-11-64.

---

మిత్రులు కోగంటివారు

శ్రీరాం వీరబ్రహ్మకవిగారికి మీరు గురుదక్షిణ యివ్వ నెంచుట సముచితము. వీరబ్రహ్మకవి కవి. బంధకవి ప్రబంధకవి. అవధాని. పండితుడు. మీ సముదార గురుదక్షిణకు, వారికిచ్చుటతో మెరుగు రాగలదు.

మీ యత్నాలు మీరు చేయు ప్రయత్నాలు మీకు

హ్యాద్యాలు. ఎచ్చట ప్రచారమవసరమో అచ్చట ప్రచారము చేయుచుంటిరి.

మీ కృషికి నా ధన్యవాదాలు. మీ ఆహ్వానిత కవి సత్తములకు నా అభినందనములు. భవదీయుడు, ఆ ప్పుల గోపాలకృష్ణమూర్తి, ఎం. ఏ, బిఎడ్, తెనాలి, 1-12-64.

---

మహాశయులారా!

శ్రీ దుర్గా మల్లికార్జునరావుగారు తమ గురువుగారైన శ్రీ శ్రీరాం వీరబ్రహ్మకవిగారి యందు మనో వాక్కాయ కర్మల భక్తి తత్పరులు.

శిష్యునియందు గురువుగారికిని అత్యంత వాత్సల్యము గలదు. పరస్పరము స్వధర్మమును గుర్తించిన వీరిరువురు గురు శిష్యలోకమునకు ఆదర్శప్రాయులు. ఇందు సందేహమే మాత్రము లేదు. నేడు శిష్యుడు దేశికులకు "గురుదక్షిణ" నొసంగుట విద్యార్థికు లందఱును సంతోషింపదగిన విష యము. భగవానుడు వీరికి సమస్త శుభములను గలిగించు గాత. పెద్దలకు నా వందనములు. తమ విధేయుడు, ఉభయ భాషా ప్రవీణ జాస్తి వేంకటనరసయ్య, చిలకలూరిపేట, 1-12-64.

---

మిత్రులు. శ్రీ మల్లికార్జునరావుగారికి

"గురుకుల వాసములు" పోయి శైక్షోపాధ్యాయు కనిదాఘ నదీ జలము వోలె సన్నగిల్లుచున్న ఈ రోజులలో గురు దక్షిణా కార్యక్రమములో వేడుక చేసికొన్న మీరును విద్యార్థి కామేష్టి చిరకాలముగా సాగించి ధన్యులైన శ్రీ వీర

బ్రహ్మకవిగారికిని నా అభినందనములు. అభివందనములు.

ఈ యుత్సవము సోత్సాహముగ ప్రవృత్తమై అధునా తన శిష్యపరంపరకు ఆదర్శమై వెలయుఁగాత. ఇట్లు, పండిత కొత్త సత్యనారాయణచౌదరి, లెక్చరర్, పి. బి. యన్. కాలేజి, నిడుబ్రోలు, 2-12-1964.

---

ప్రియమైన మల్లికార్జునరావుగారూ! ఆర్యా! నమస్తే.

తాము దయతో వ్రాసిన కార్డునందుకొని సంతస మొందితిని. ముఖ్యముగా విచ్చేయ వలయునని యభిలాష పడితినిగాని వీలు చిక్కలేదు. వచ్చి మీ గురుదక్షిణ భాగములో కొంత సమర్పింప దలంచితిని. కాని యట్లు జరిగించ జాలనందుకు చింతిలుచున్నాను.

ఇతర గుణ గ్రహణ పారీణులయిన బ్రహ్మశ్రీ వీరబ్రహ్మ కవిగారిని నా బోటి యల్ప వ్యక్తి కీర్తించుట సూర్యభగవానుని దివిటీతో చూపినట్లుగనే యుండును. శ్రీయుత వీరబ్రహ్మ కవిగారు నానా రాజన్య చరిత్ర రచయితలై మా వెలమ జమీందారీల నెంతగనో శ్లాఘించి యుండిరి. (ముఖ్యముగా పిఠాపురం సంస్థానము) శ్రీ వారికి భగవానుఁ డాయురారోగ్యైశ్వర్యముల నొసంగుఁ గాత. ఇట్లు, దద్దనాల లక్ష్మీసత్య నారాయణయ్య, ఎడిటర్, పద్మనాయక, రాజేపల్లిగూడెము 3-12 64.



శ్రీ పొట్టి శ్రీరాములు



శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య

## ధన్యుండవు

కం॥ గురునకు గురుదక్షిణ ని
ష్కరణి సమర్పించి నీ యకల్మష భక్తిన్
సరివారి కెల్లఁ జేసితి
వర కే! ధన్యుండవు మల్లికార్జునరాయా!
కం॥ వరుసగఁ బ్రియ శిష్యులచే
గురుదక్షిణ లందుకొనుచు గురుతర కీర్తిన్
బరఁగుత! వీరబ్రహ్మము
పరమాత్మని సత్కృపా ప్రభావము వలనన్॥
కం॥ ధీరోదాత్తుండు సుగుణో
దారుఁడు సుధకరుఁడు గాఁగఁ దనరెడు శ్రీరాం
వీరబ్రహ్మ కవీంద్రుని
శ్రీరాముఁడు నోముఁ గాత! ప్రేముడి మీఱన్॥

కవిరత్న, సున్నం వీరరాజు, విశాఖపట్టణము, 2-12 1964

—o—

## కవిరత్న శ్రీ పుల్లంపల్లి రామలింగేశ్వరశర్మ

వీరి తండ్రి మల్లికార్జునశాస్త్రిగారు. తల్లి కనకదుర్గాంబ గారు. 1927వ సంవత్సరము, ఏప్రియల్ 25వ తారీఖున జన్మిం చిరి. ఆంధ్ర పండితులు. వీరిది పండిత కుటుంబము. శ్రీ మల్లి కార్జునశాస్త్రిగారు విద్వత్కవులు. బహుగ్రంథ కర్తలు. శర్మ

గారి గురువులు. శర్మగారి యగ్రజులయిన శ్రీ వీరమల్లేశ్వర శర్మ, శ్రీ వీరేశ్వర శర్మగార్లు కూడ గురువులు.

శర్మగారు తమ సోదరులు శ్రీ శరభయ్యశర్మగారితోఁ బాటు బాల్యముననే, కవితారచనమునకుఁ గడంగిరి. శరభయ్య శర్మగారు "వృంభారతీ" "బాలకవికేసరి" బిరుదములను బడసిరి. రామలింగేశ్వరశర్మగారికి భారతీ సమితివారు "కవిరత్న" బిరుదము నొసంగి సత్కరించిరి.

కావ్యమంజూష, శ్రీ రాధామాధవము, శ్రీ శాకుంతలము, శ్రీబాలరాఘవము (నాటకము) మున్నగు గ్రంథములను రచించిరి. ఇవి యముద్రితములు. రచన సరళముగను గంభీరముగను రసవంతముగ నుండును.

శ్లో॥ జయతు! జయతు! దివ్య బ్రహ్మ గాంధర్వమూర్తిః,
పరమ పురుషమూర్తి, ర్వ్యస్తవాద్వైత మూర్తిః।
జయతు! జయతు! నిత్యశ్రీ సమాశ్లిష్ట మూర్తిః,
మహిత కరుణమూర్తి, ర్వేణు గోపాలమూర్తిః॥

చం॥ లసిత శరద్విధూదయము లన్వలయా వరణోచితమ్ముగాఁ,
బసికదు పుల్నిలంగ, పరివల్లవ బాలిక జాల కోల్లస
త్కుసనిభ గోపికావ్రజము, గేల్గవలూపఁ జెలంగు, రాధికా
రసపరి పోషకంబులగు రాసకలాపము సోము నెల్లసిన్॥

ఉ॥ కంజవెలుంగుచేలము,పసందగు నెమ్మిమొయిల్తురాయి,భా
రంజిత విద్రుమాధరము, రాజదుర స్వరహార మొప్ప, నో
కంజ దళేక్షణా! విడుమ కన్గవ మూఁత, భవద్విముక్తనై
యుండెద నే? యెవీనినురు నా నగలంటి నే? నిన్ను తిరపఁగన్॥

మ॥ అమర న్వేణువు గేలఁ గోమల కలావ్యాసంగ పారంగతా
సమబింబాధరన ర్తితారుణితనాసాహ స్తికాలంబ! సం
భ్రమలీలాఁ సరాధికా హృదయభానం బొప్పగావింతు,వీ
వమృతా కల్పముగా,వ్రజేశ!వని,బ్రహ్మానందగానంబహో!

ఉ॥ ఆమెయి, రాధికం దనిపి, యక్కటకంటి మలంగి, సుందరా
రామముల స్మనోహర సరస్తట సీమలఁ వేణుగాన లీ
లామధుర ప్రఘోషముల, లాలిత శారద పూర్ణిమా కథా
స్తోత్రములన్ని తాంతపరితుష్టతఁ బొల్చువ్రజేశుఁడోముతన్॥

(శ్రీ రాధామాధవము)

ఉ॥ ఈవొల పానుపెద్ది? పురుషోత్తము నిద్దురవేళ, నూతగాఁ
గాయము నిల్పునెద్ది? యెదిగంధసమాశ్రయవృత్తి, యెద్దినా
దాయితమూర్తి? యెద్ది? హావిరాశ్రయు మెద్ది? చంబుబోధమే
దేయది? సూత్రరూపమిటులెన్నిదిరూపుల వేల్పుప్రోచుతన్॥

చం॥ చెలులయి పల్కు లేమ, సిరిచెల్వ చలాచలచామరంబుగా
వలపట, దాపటం గొలువఁ బాదసరోజ మిళన్మిళింద తా
పులకితభక్త, శ్రీలలిత, పూర్ణమనోరథుఁ జేయుతన్! సము
జ్జ్వలతవితాను గుంఫన నచః పటుతా ప్రభుతా సమృద్ధులన్॥

(శ్రీ శాకుంతలము)

చం॥ లలిత మధుప్రభాతము, వలద్విశద స్ఫుట రమ్య తారకా
పులకితయామినీ సఖము, ముగ్ధ వధూ ముఖచంద్రమః కలా
కలితము, కావ్య జాల కవి భాసిత శక్ర హరిల్ల లామ పా
టలరుచిరంజితంబు గిరటంబుల రేపు ముదబ్ధి వేలలన్॥

చం॥ సరసులకమ్మఁ బావిసరసంబగు సంపెఁగ యూప్పచంద్రమై
వరలఁగఁ బుప్పఁ జేనెల నెపంబున, సమ్మద బాష్ప
పూరముల్,
తెరలగ, నెమ్మదిం గలఁకఁ దేఱి, యువస్సతి, సాగసంపు సం
బరమఁటి గౌరవంబుగఁ బ్రభాకరు, లోక హిత ప్రభాకరున్॥

చం॥ సురముని సేవితంబయి, వసుప్రభు రోచిరుదార భాసమై,
సరసిజ జాల మందిర రస ప్రభు తాంచిత చంచరీకమై,
పరిణత భావ నా పథ సభాజిత కావ్య సమాజ వాసనా
సురభిమధు ప్రభాతము, సుశోభితమై, యలరించు నెల్లెడన్॥

(శ్రీ కావ్యమయూఖ)

—o—

## శ్రీ పదుళ్లపల్లి రామకృష్ణమూర్తి

పశ్చిమ గోదావరి జిల్లా భీమవరము తాలూకా చిన అమిర మను నొక గ్రామమునందు 1916 వ సంవత్సరము, ఆగస్టు 20వ తారీఖున, శ్రీ పదుళ్లపల్లి రామకృష్ణమూర్తిగారు జన్మించిరి. తల్లి సుబ్బమ్మగారు. తండ్రి సీతారామయ్యగారు. ఈ దంపతుల కీరుపురు జన్మించిన తరువాతఁ బుట్టినవారు రామకృష్ణమూర్తిగారు. వీరు స్వగ్రామములోనే ప్రాథమిక విద్య నభ్యసించిరి. వీరి గురువులు శ్రీ తాడేపల్లి యజ్ఞన్నగారు యజ్ఞన్నగారు శ్రద్ధతోఁ జదువు చెప్పిరి.

1927 వ సంవత్సరములో భీమవరములోని యు. యల్. సి. యం. మిషను హైస్కూలులో నయిదవ తరగతిలో జేరిరి. బోధనా నైపుణ్యముగల శ్రీ వెన్నేటి సుబ్బారావుగారు మూడవ ఫారములో వీరికి లెక్కలు చెప్పిరి.

1935 వ సంవత్సరములో యస్. యస్. యల్. సి పరీక్ష యందు తీర్ణు లయిరి. 1937, 39 సంవత్సరములలో బందరు పట్టణము నందలి నోబుల్ కాలేజి ట్రయినింగు స్కూలులో ప్రవేశించి, చదివి సెకండరీ గ్రేడ్ ట్రయినింగు పరీక్షలో విజయమందిరి. శ్రీ నంగుల జగన్నాథముగారు స్థాపించిన యెయిడెడు ఎలిమెంటరీస్కూలులో 1939 వ సంవత్సరము జూలై 1వ తారీఖున ప్రవేశించి యుపాధ్యాయుడుగా బని చేసిరి. వీరి సహోపాధ్యాయులు శ్రీ యడవల్లి సుబ్బయ్యగారు. సుబ్బయ్యగారు వీరి తండ్రి గారికిని, సోదరులకును గురువులగుట వలన వీరియందెంతో ప్రేమను జూపెడివారు. ఆ పాఠశాలలో 5 సంవత్సరముల వఱకు బని చేసిరి. తరువాత నా మిషను యాజమాన్యమున నడుపబడుచున్న ఎలిమెంటరీస్కూలులో జేరి 6 సంవత్సరముల వఱకు బని చేసిరి. అనంతరం రాజీనామా యిచ్చి శ్రీ జూపూడి కేశవరావుగారి హైస్కూలులో నొక సంవత్సరము వఱకు బని చేసిరి తరువాత నా పాఠశాలలో బని చేయుట విరమించుకొనిరి.

1943 వ సంవత్సరము మార్చి 1వ తారీఖున సీతారామయ్యగారు దివంగతులయిరి. వీరు తమ కుటుంబము నుండి విడిపోయి భీమవరములో కాపురము చేయుచు సమీప గ్రామములలోని ప్రాథమిక పాఠశాలలో బని చేసియుండిరి.

ఉపాధ్యాయ వృత్తిలో నుండి, ప్రయివేటుగా ఎఫ్. ఏ, బి. ఏ పరీక్షలను జదివి 1950 వ సంవత్సరములోఁ బట్టభద్రులయిరి. బి. ఏ లో నభిమాన భాష తెనుఁగు. 1952 వ సంవత్సరము డిశంబరు 2వ తారీఖున గుడివాడలోని ఎ. ఎన్. ఆర్ కళా శాలలోఁ జేరి తెలుఁగు ట్యూటరుగాఁ బని చేయుచున్నారు.

1955-1959 సంవత్సరములలో యం. ఏ పరీక్షకు (సంస్కృతము) హాజరయి కాశీ విశ్వవిద్యాలయము వారిచే "పోస్టుగ్రాడ్యుయేట్" డిగ్రీఁ బొందిరి. తరువాతఁ దెలుఁగు డిపార్టుమెంటులోఁ బనిచేయుచునే యాంధ్రవిశ్వవిద్యాలయము వారి తెలుఁగు యం. ఏ పరీక్షకుఁ జదివి యుత్తీర్ణులయిరి. (1968-1970 సంవత్సరములలో) తెలుఁగు శాఖలోనే పని చేయుచున్నారు. ఎక్కువగా స్వయం కృషి చేసి విద్య నార్జించిరి. 1971వ సంవత్సరము మే నెల 9వ తారీఖున గుడివాడలో జరిగిన భారతీ సమితి యెన్నికలో వీరు భారతీ సమితి కధ్యక్షులుగా నేకగ్రీవముగా నెన్నుకొనఁబడిరి.——

(సంపూర్ణము)

## శ్రీ బొడ్డుపాటి లక్ష్మీసుబ్బారావు

శ్రీ బొడ్డుపాటి లక్ష్మీసుబ్బారావుగారి జన్మస్థానము కైకలూరు తాలూకా బొమ్మినంపాడు గ్రామము. వీరు 1914వ సంవత్సరము, ఏప్రిల్ 29వ తారీఖున మాతామహుని గృహము నందు జన్మించిరి. తల్లి సరస్వతమ్మగారు

తండ్రి పూర్ణసుందరరావుగారు. భార్య కృష్ణవేణమ్మగారు.

శ్రీ ఉమాపతిగారి యొద్ద 4వ తరగతి వఱకు జదివి పిదప గుడివాడ బోర్డు హైస్కూలులో 6వ తరగతి యందుఁ జేరి యస్. యస్. యల్. సి వరకా పాఠశాలలోనే చదివిరి. యస్. యస్. యల్. సి పరీక్షలోఁ దప్పిపోయిరి. 1931వ సంవత్సరములో బందరు నోబుల్ హైస్కూలులోఁ బ్రవేశించి చదివిరి. యస్ యస్. యల్. సి పరీక్ష యందుత్తీర్ణులయిరి.

1933వ సంవత్సరము మార్చి 10వ తేదీ నుండి గుడివాడ తాలూకా రామాపురం గ్రామ మునసబుగాఁ బని చేయుచున్నారు. 7 సంవత్సరముల నుండి యా గ్రామమునకుఁ గరణముగాఁ గూడఁ బని చేయుచున్నారు. ఆంధ్రప్రదేశ్ వారపత్రికకు సంపాదకులుగా నుండిరి. గ్రామోద్ధరణ పత్రికా సంపాదకులయిన శ్రీ బొడ్డపాటి పూర్ణసుందరరావుగారు కీర్తిశేషులయిన తరువాత గ్రామోద్ధరణ పత్రికకుఁ గూడ సంపాదకులుగా నుండిరి. ఆంధ్రప్రదేశ్ గ్రామోద్యోగుల సంఘమునకుఁ బ్రధాన కార్యదర్శిగా 1956వ సంవత్సరము నుండి 1965వ సంవత్సరము వరకుఁ బని చేసి యుండిరి. 1960వ సంవత్సరము నుండి నేటి వరకును శ్రీ సుందరం గ్రామోద్యోగీయ కళాశాలకుఁ బ్రధానాచార్యులుగాఁ బని చేయుచున్నారు.

(సంపూర్ణము)



శ్రీ తిపిర్నేని శివాజీరావు



చి రం జీ వి

బొడ్డపాటి పూర్ణసుందరరావు

# చిరంజీవి బొడ్డుపాటి హర్షసుందరరావు



తల్లి కృష్ణవేణమ్మగారు, తండ్రి లక్ష్మీసుబ్బారావుగారు. 1950వ సంవత్సరము, సెప్టెంబరు 24 వ తారీఖున బందరులో మాతామహుని గృహము నందు జన్మించెను. విజయవాడ వాణీ హైస్కూలు ఎలిమెంటరీ స్కూలులో 5వ తరగతి వరకును శ్రీ వేముల కూర్మయ్య హైస్కూలులో 6వ తరగతి నుండి 4వ ఫారము వరకు విద్యనభ్యసించెను.

ఆంధ్రాంగ్ల భాషలయందు వక్తృత్వములో జరిగిన పోటీలలో ఫస్టుగా వచ్చుట వలన గ్రంథములు నొసంగి గౌరవించిరి. విజయవాడ శ్రీ నుతూరి వేంకటరెడ్డి హైస్కూలులో 5, 6 ఫారములు చదువును, యస్. ఆర్. ఆర్. & సి. వి. ఆర్. గవర్నమెంటు కాలేజీలో, పి. యు. సి. నుండి బి. యస్. సి. వరకును చదువుకొనిరి. బి. యస్. సి పరీక్షలో, సెకండ్ క్లాసులో రావలసిన మార్కులు కంటె నెక్కువ మార్కులు వచ్చినవి. ఫస్టు క్లాసులో రావలసిన మార్కులలో నొక మార్కు మాత్రము తక్కువయ్యెను. అనంతరము నాగపూర్ సైన్సు కాలేజీలో ప్రవేశించి చదువుచుండెను. నాగపూర్ యూనివర్సిటీ ఆంధ్ర విద్యార్థి సంఘమునకు జాయింటు సెక్రటరీగా నెన్నుకొనబడెను. అప్పుడప్పుడు పద్యములను, గేయములను వ్రాయుచుండెను.

# భారతీ సన్మాన సంఘము 5 వ వార్షికోత్సవము

నవంబరు ౬వ తేదీ సాయంకాలము ౫ గంటలకు గుడివాడ మునిసిపల్ హైస్కూలులో శతావధాని శ్రీ ఓంకారము గురవరాజకవిగారి యధ్యక్షతను, పామఱ్ఱు భారతీ సన్మాన సంఘము ౬వ వార్షిక మహాసభ జరిగినది. శ్రీ సి. శ్రీరామమూర్తి గారు దైవ ప్రార్థన చేసిరి. అధ్యక్షులు, తిరుపతి వేంకట కవులకును కొప్పరపు సోదర కవులకును జరిగిన వివాదములను గురించి యుపన్యసించి వారి పద్యములను జదివి సభ్యుల కమందానందమును గలిగించిరి.

భారతీ సన్మాన సంఘ కార్యదర్శి శ్రీ కోగంటి దుర్గా మల్లికార్జునరావుగారు కార్యదర్శి నివేదికను జదివిరి. సన్మాన సంఘాధ్యక్షులు శ్రీ జాస్తి వేంకటనరసయ్యగారు "నేడు భారత దేశములో విద్యావంతులు చాల తక్కువగా నున్నారు. వారిలో కళల ప్రయోజనములను తెలిసికొనువారు కొలది మంది మాత్రమే గలరు. కళలభివృద్ధి చెందినపుడు దేశౌన్నత్యమును బొందును. జవహరులాల్ నెహ్రూ గారు జాతి వికాసము కళల మీఁద నాధారపడి యున్నదన్నారు." అని యుపన్యసించిరి.

గ్రామోద్ధారక శ్రీ బొడ్డపాటి పూర్ణసుందరరావు పంతులుగారు భారతీ సన్మాన సంఘము వారు చేయుచున్న కృషిని గొనియాడిరి.

స్థానిక హైస్కూలు ప్రధానోపాధ్యాయులు శ్రీ గుత్తా

వీరరాఘవులు గారు (బి. ఏ. బి. ఇ. గి.) కళారాధకులను ప్రభుత్వముగారు తప్పక ప్రోత్సహింప వలెనని యుగ్గడించిరి.

శ్రీ ఆకాని నరసింహారావుగారు తిరుపతి వేంకటకవులు రచించిన పద్యములలో గొన్ని చదివిరి.

కృష్ణా మండల గ్రంథాలయ సంఘ కార్యదర్శి శ్రీ నాగులపల్లి సీతారామయ్యగారు గ్రంథాలయాధికారులు, గ్రంథములను స్వీకరించి కవులను పోషింపవలెనని ప్రసంగించిరి

ఈ క్రింది తీర్మానములు గావింపబడినవి

1 వ్యవసాయ శాఖామాత్యు లయిన శ్రీ నీరుకొండ వేంకటరామారావు గారును, సుప్రసిద్ధ కవీశ్వరులయిన శ్రీ ఓలేటి పార్వతీశ్వర శాస్త్రిగారును, సుప్రసిద్ధ దేశ భక్తు లయిన శ్రీ గద్దె రంగయ్యనాయుడుగారును దివంగతు లయినందులకీ సభవారు చింతిల్లుచు వారి కుటుంబములకు సానుభూతిని తెలియజేయుచు వారి యాత్మలకు శాంతిని ప్రసాదింప సర్వేశ్వరుని ప్రార్థించు చున్నారు.

2 వెంటనే విశాలాంధ్రా నవతరణకు సమ్మతింప, తెలంగాణా నాయకులను ప్రజలను గోరుచున్నారు.

3 తెలుగు వారెక్కువగా నివసించుచున్న బళ్ళారి, గంజాం మున్నగు ప్రదేశములను వెంటనే యాంధ్ర రాష్ట్రములో, చేర్పింప గలందులకీ సభవారు కేంద్ర ప్రభుత్వము వారిని ప్రార్థించు చున్నారు.

—o—



శ్రీమతి కల్లూరి విశాలాక్షమ్మ



శ్రీమతి పుచ్ఛా భానుమతి

# గ్రేడ్ 1 గ్రంథాలయము, గుడివాడ.

ఇది 1954 వ సంవత్సరములో స్థాపింపబడినది. దీనిలో నేడు పలుగురు పని చేయుచున్నారు. శ్రీ కె. విఠల్ శాస్త్రి గ్రేడ్ 1 గ్రంథాలయాధికారి. శ్రీ కె. నాగేశ్వరరావు అటెండరు. శ్రీ కె. శ్రీరామమూర్తి అటెండరు. శ్రీ పి. వి. రాఘవులు వాచ్ మన్.

తెలుగు పుస్తకములు 7017 ఇంగ్లీషు పుస్తకములు 1017 హిందీ పుస్తకములు 45 మొత్తము 8079 పుస్తకములు గలవు.

తెలుగు పత్రికలు— దినపత్రికలు— ఆంధ్రపత్రిక, ఆంధ్రజ్యోతి, ఆంధ్రప్రభ, ఆంధ్రభూమి, విశాలాంధ్ర. వారపత్రికలు— ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి, ప్రగతి, చుక్కాని, కృష్ణాపత్రిక, జాగృతి, ప్రజామతి. పక్షపత్రికలు— నవ్వులరాణి, సోవియట్ ల్యాండ్, మాసపత్రికలు— చందమామ, బాలమిత్ర, విజయచిత్ర, స్వాతి, జయశ్రీ, అన్నదాత, ఆంధ్రప్రదేశ్, వసుధ. జగతి, తెలుగు విద్యార్థి, యువ, పసిడిబాల, భారతి, శ్రీమతులు. త్రైమాసిక పత్రికలు— జ్యోతిష విజ్ఞాన పత్రిక, ప్రసారిత.

ఇంగ్లీషు పత్రికలు— దినపత్రికలు— ఇండియన్ ఎక్స్ ప్రెస్, ది. హిందూ, డెక్కన్ క్రానికల్, వారపత్రికలు— ఆర్గనైజర్, ఇలస్ట్రేటెడ్ వీక్లీ, బ్లిట్జ్, స్క్రీన్, స్వరాజ్య, లింకు, శంకర్స్ వీక్లీ, కరెంటు, న్యూస్ వీక్. పక్షపత్రికలు— ఫిలింఫేర్,

ఫెమినా, భవాన్సు జర్నల్, మాసపత్రికలు— (భిటలా, ఎస్సి) లాజికల్ మేగజైన్, కాంపిటీషన్ మాష్టర్, కాంపిటీషన్ రెవ్యూ, క్విజ్ మెజిస్ట్రేట్, కెరీర్సు డైజెస్టు, సైన్సు టుడే, బాలకం, త్రైమాసికపత్రికలు— త్రివేణి

ప్రతిదినము గ్రంథాలయమునకు హాజరగు పాఠకులు 180 మంది. చదువరులకిచ్చు పుస్తకములు 37, ఇంటికిచ్చు పుస్తకములు 58 మొత్తము ధరావతుదారులు 503.

—o—

## శ్రీ పిండికంటి కోటేశ్వరరావుగారి షష్టిపూర్తి మహోత్సవము, గుడివాడ, 7-11-1971.

పూజ్యశ్రీ కొగంటి దుర్గామల్లికార్జునకవిగారికి, నమస్సులు. తామా దయతో అంపిన ఆహ్వాన మందినది. కృతజ్ఞుడను.

సుహృన్మిత్రులకు సభాసీనులకు నమోవాకములు. జీవిత ద్వితీయార్ధములో వచ్చు మహోత్సవము షష్ట్యబ్ద్యుత్సవము. అది అందరికి ప్రాప్తముండదు. కొందరికి సాధ్యపడదు. శ్రీయుత పింగికంటి కోటేశ్వరరావుగారికి అట్టి యుత్సవము మహోత్సాలతో జరుపుకొను అవకాశము కల్గుట వారు ధన్యులు.

ఈ శుభవేళ యిందరు మిత్రులతో సంతోషాన్ని పంచుకొనుట యేగాక, నిజమైన శుభాన్ని, ఆనందాన్ని యిచ్చు

నట్లు శ్రీయుతులు కోగంటి దుర్గామల్లికార్జునకవి కోడూరి శ్రీరాములు, బాకా శ్రీరాములు గార్లను సన్మానించుట ద్వారా యీ మహాస్సును మహోత్సవముగా రూపుదిద్ది కొనుట సకలశుభదము. ఆ భగవాదాన్సనతో నీ సభ జయప్రదమగుగాక. డాక్టరు మల్లిబాబు, తెల్లజెండా సంపాదకుడు. నరసాపురము, 4-11-71.

---

మిత్రమా! విద్వన్మిత్రమా! నమస్కారములు.

భారతీ సమితి ఆధ్వర్యమున 7-11-71 తేదీని గుడివాడలో బసవరాజు శ్రీ పింగళికంటి కోటేశ్వరరావుగారి షష్టిపూర్తి మహోత్సవ సన్మానములు విజయప్రదముగా సెరవేరును గాక, నాకు సమస్తాస్సుఖనో భవంతు. ఉభయ భాషాప్రవీణ, సుకవిమిత్ర జంపాల వేంకటనృసింహము, సుగ్గిరాల, 4-11-71

---

ప్రియమిత్రమా! నమస్తే! మీరు పంపిన ఆహ్వానమందినది. శ్రీ పింగళికంటి కోటేశ్వరరావుగారి షష్టిపూర్తి మహోత్సవ సందర్భమున కవులకు సన్మానములు జరుపుటలో అభినందించవలసిన విషయము. వారికి పరమేశ్వరానుగ్రహమున సౌఖ్యముల నొసగుచున్నాను గాకయని కోరెదను. చిత్తగించవలెను. విమర్శకాగ్రేసర కొత్త భావయ్యచౌదరి, సంగం జాగర్లమూడి, 1-11-71

---

అర్యా! నమస్కారములు. ఈ నెల 7వ తేదీన ఇతర కార్యక్రమములవల్ల గుడివాడ రాలేకపోతున్నాను, సమావేశం దిగ్విజయ మగుగాక. ముక్తేవి శ్రీరంగాచార్యులు మచిలీపట్టణము, 4-11-71



శ్రీ నిడసనమెట్ల కొండలరావు



శ్రీ బుగ్గా పాపయ్యశాస్త్రి

మహాశయులారా! నమస్సులు. తమ ఆహ్వాన మందినది. పూజనీయులు శ్రీ పింగికంటి కోటేశ్వరరావుగారి షష్టిపూర్తి మహోత్సవము జయప్రదముగ జరుగుగాక. వీరికి పరమేశ్వరుడు ఆయురారోగ్యములు ప్రసాదించు గాకయని కోరుచున్నాను. సత్సభలో సర్వశ్రీ కోసూరి శ్రీరాములు, బొర్రా శ్రీరాములు, తమకు సన్మానము జరుగుట ముదావహము. సాహితీ పరులగు తమందరికి నా హృదయ పూర్వక అభినందనలు అందజేయ కోరుచున్నాను. త్రిపురమల్లు లక్ష్మయ్యగుప్త జర్నలిస్టు, గుంటూరు, 4-11-71.

---

కలవగుంట శ్రీ రామారావు నమస్కారములు.

ఆర్యా! భారతీ సమితి యాధ్వర్యమున గుడివాడలో ఈ నెల 7వ తేదీ ఆదివారము రోజున జరుపబడు శ్రీ పింగి కంటి కోటేశ్వరరావుగారి షష్టిపూర్తి మహోత్సవమునకు తమరు దయతో నాకు పంపిన ఆహ్వానము అందినది.

అస్వాస్థ్యము వలన నేను అక్కడకు వచ్చి మహోత్సవములో పాల్గొన లేక పోయినందుకు చింతిలుచున్నాను. నా అనారోగ్యము వలన భాషా సేవకులయిన గొప్పవారి దర్శనము కూడ నాకు లభ్యముగుట లేదు. శ్రీ కోటేశ్వరరావుగారి షష్టిపూర్తి మహోత్సవము జయప్రదముగా జరుగ గలదని నేను ఆశిస్తున్నాను. చిత్తగించ వలయును. కలవగుంట శ్రీరామారావు, ఎడిటర్ తుషార్, శ్రీనగర్, బందరు

4-11-1971.

—o—

ఉ॥ శాశ్వదనంత వైభవ విశాల యశోధనుఁ జేయఁ గల్గి వా
గీశ్వరి సత్కృపా గరిమ నెంతయుఁ దాశత వత్సరంబులన్
శాశ్వత భాగ్య భోగములు సంధిల నిచ్చలుఁ బిండికంటి కో
టీశ్వరరావు వర్ధిలుత నీవుడుపున్ సకలార్థ సిద్ధులన్॥

తే॥ షష్టిపూర్తి మహోత్సవ సమయ మందు
సత్కృతిన్ గాంచునట్టి విజ్ఞాన ధనులు
అనఘ కోమటి వైశ్య కులాబ్ధి సోము
తైల శ్రీరామ యుగళము నహరహంబు
శారదాదేవి కృపతో మనసాకుఁ గాత॥

తే॥ తప్పులున్న క్షమియించి మిత్రత గణింప
వేడుకొనెదను, సభ్య పవిత్రులార!
కలసి కోసఁగను వధాన లలిత సభను
మాకు సెలవు బాబు శ్రేయుఁడు మణివకుండ

అష్టావధాని బులుసు వేంకటరామమూర్తి, రాజమండ్రి,
4-11-71.



శ్రీ కొత్త భావయ్యచౌదరి





శ్రీ శ్రీరామ్ వీరబ్రహ్మకవి

# చిత్ర విమర్శనము

ఉభయభాషాప్రవీణ శ్రీ జాస్తి వేంకటనరసయ్య చిలకలూరిపేట హైస్కూలులో తెలుగు పండితుడు. గ్రంథాలయ సర్వస్వ సంపాదకులలో నొకరు. స్వాతంత్ర్యోద్యమములో పనిచేసి కారాగారశిక్ష ననుభవించిరి. కవి బహుగ్రంథకర్త భారతీసమితి, సన్యాస సంఘముల కార్యకర్తలుగానుండిరి కృతిపతి.

శ్రీ శిరగాని రామస్వామిచౌదరి—రచయిత. గ్రంథకర్త. కృతిపతి. శాసనోల్లంఘనోద్యమములో, బనిచేసి జైలు శిక్షననుభవించిరి. గ్రంథాలయోద్యమములో బని చేయుచున్నారు. మాజీ యం. యల్. ఏ.

సాహిత్యభూషణ శ్రీ వేదము రామప్రభువు ఎం. ఏ. యల్. టి, చరిత్ర శాస్త్రాధ్యాపకుడు ఎ. ఎన్. ఆర్. కళాశాల, గుడివాడ. భారతీసమితి సభ్యుడు.

విద్వాన్, శతావధాని శ్రీ భమిడిపాటి అయ్యప్ప శాస్త్రి గుడివాడ బోర్డు హైస్కూలులో సంస్కృత పండితుడు. బహు గ్రంథకర్త.

విద్వాన్, కవిరత్న శ్రీ వంగవోలు ఆదిశేషశాస్త్రి ఎం. ఏ, పిహెచ్.డి. ఆంగ్ల భాషాధ్యాపకుడు, జిల్లా పరిషత్ హైస్కూలు, పసుమర్రు, గుంటూరుజిల్లా.

బారిష్టరు శ్రీ లింగం వీరభద్రయ్యచౌదరి, పెదనగల్లు. జన్మస్థానము, అంగలూరు. తండ్రి నివాసస్థానము బొమ్ములూరు. రచయిత బహు గ్రంథకర్త. రసికుడు. ఉదార

హృదయుడు. రిటైర్డు అసిస్టెంటు ఇన్‌కంటాక్సు ఆఫీసరు. భారతీసమితి గౌరవాధ్యక్షుడు. భూస్వామి.

శ్రీ షేక్ అలీ బి. ఏ, బిఇడి. తెలుగు పండితుడు జిల్లా పరిషత్ హైస్కూలు, యద్దనపూడి. కవి. గ్రంథకర్త.

శ్రీ గుళ్లపల్లి రామబ్రహ్మం–దురుమగ్గాలి. స్వాతంత్ర్య సమర యోధుడు. భారతీసమితి వైస్ ప్రసిడెంటు. పరోపకార పరాయణుడు.

శ్రీ అట్లూరి జనార్దనరావు–చౌటపల్లి. భూస్వామి. సజ్జనుడు.

కవిరత్న శ్రీ కోసూరి శ్రీరాములు –రోడ్ ఇన్‌స్పెక్టరు. గుడివాడ. భారతీసమితి సన్మాన సంఘముల సహాయ కార్యదర్శి, భారతీసమితి ఆస్థానకవి. వక్త. గ్రంథకర్త.

డాక్టరు శ్రీ అడుసుమల్లి నారాయణరావు యం. బి. బి. యస్. గుడివాడ. కవి. బహు గ్రంథకర్త. ఆంధ్ర నలంద స్థాపకుడు. సాహిత్యపోషకుడు.

డాక్టరు శ్రీ యెర్నేని వేంకటేశ్వరరావు, యం. యస్. సి. పి. హెచ్. డి, ప్రిన్సిపాల్, ఎ. ఎన్. ఆర్. కాలేజ్, గుడివాడ. వక్త.

శ్రీ పింగికంటి కోటేశ్వరరావు, గుడివాడ. ఎలక్ట్రికల్ ఆఫీసులో పని.—

శ్రీమతి పింగికంటి అన్నపూర్ణమ్మ. శ్రీ కోటేశ్వరరావు గారి సతీమణి. గుడివాడ. కవయిత్రి. బహు గ్రంథకర్త్రి భారతీసమితి సభ్యురాలు.

శ్రీ బొడ్డపాటి పూర్ణసుందరరావు - గ్రామోద్ధరణ పత్రికా స్థాపకుడు. సంపాదకుడు. సుందరం గ్రామోద్యోగీయ కళాశాల స్థాపకుడు. ప్రిన్సిపాల్. గ్రామాధికారి, రచయిత బహు గ్రంథకర్త.

శ్రీ వేములపల్లి రామకృష్ణారావు బి. ఏ, బి.ఇడి. టవున్ హైస్కూలు హెడ్మాష్టరు. బహుభాషి. గుడివాడ.

కవిసార్వభౌమ శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, రాజమంత్రి, ఆస్థానకవి. బహు గ్రంథకర్త. బహు బిరుదాంచితుడు. సౌందర్యవంతుడు. వదాన్యుడు.

శ్రీ కెంపరాజు చినరామస్వామి ఎం. ఏ, హిందీ శాఖాధ్యక్షుడు. ఎ. ఎన్. ఆర్. కాలేజీ, గుడివాడ.

శ్రీ త్రిపురమల్లు లక్ష్మయ్యగుప్త - జర్నలిస్టు గ్రంథాలయోద్యమములోఁబని చేయుచున్నారు. సత్యాగ్రహిగానుండి కారాగారశిక్ష ననుభవించిరి. వక్త. కృతిపతి.

శ్రీ కరెడ్ల నరసింహం-గుడివాడలో శ్రీ బుగ్గా పాపయ్యశాస్త్రిగారిని సన్మానించిరి.

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ - బాపట్ల, కవయిత్రి, బహు గ్రంథకర్త్రి.

భాషాప్రవీణ శ్రీ బొడ్డు శ్రీరాములు. కవి. కొల్లపల్లి హైస్కూలులోఁదెలుఁగు పండితుడు. గ్రంథకర్త.

గ్రంథాలయ పితామహ శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య అనేకోద్యమములలోఁబనిచేసిరి. కృతిపతి. పత్రికా సంస్థా

పకుఁడు, సంపాదకుఁడు. సరస్వతీ సామ్రాజ్య స్థాపకుఁడు. ప్రభుత్వమువారు "పద్మశ్రీ" బిరుదనొసంగిరి.

శ్రీ తిపిర్నేని శివాజీరావు – ప్రొఫెసర్. బి. ఏ. బియి. యం. యస్ (టెక్సాస్) ఏ. యం. (సిగ్మా ఎక్స్)! [యు. యస్. ఎ] ఆంధ్ర విశ్వవిద్యాలయము, వాల్తేరు.

కవయిత్రీమణి, విదుషీమణి శ్రీమతి కల్వాది శీతా లక్ష్మమ్మ, రాజమండ్రి, కవి సార్వభౌమ శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి జ్యేష్ఠపుత్రిక. బహుగ్రంథకర్త్రి.

శ్రీమతి కన్యా భానుమతి–గుడివాడ. భర్త శ్రీ ప్రకాశ్మ సందశాస్త్రి. కవయిత్రి, బహుగ్రంథకర్త్రి. దైవభక్తురాలు. పెక్కుమంది శిష్యురాండ్రుగలరు.

నటశేఖర శ్రీ సిసస వెట్టి కొండలరావు – రాజమండ్రి అనేక నాటకములలో నటించి ప్రేక్షకుల మన్ననలగాంచిరి.

శ్రీ కళాగాయక, లలితకళాప్రచారక బుర్గా పాపయ్య శాస్త్రి రాజమండ్రి. నక్ష. రచయిత. సంగీత విద్వన్మండలి కార్యదర్శి, గాయకుఁడు. గ్రంథకర్త.

విద్యాశాగ్రేసర శ్రీ కొత్త భావయ్యచౌదరి – కవి బహుగ్రంథకర్త. సంగంజాగర్లమూడి. కృతిపతి.

ఆంధ్ర భాషావాచస్పతి, కవిరత్న, సహస్రావధాని, చతుర్విధకవితాప్రవీణ శ్రీ శ్రీరామ వీరబ్రహ్మకవి. రిటైర్డు తెలుగు పండితుఁడు. బహు [illegible] భారతీసమితి మాజీ అధ్యక్షుఁడు. బందరు.

ఫ్రెంచిపేట,
మచిలీపట్టణము,
14-1-1946

మ॥ రా॥ శ్రీ కోగంటి దుర్గామల్లికార్జునరావు గారికి,
ఉభయ కుశలోపరి

మీరు వ్రాసిన యుత్తరమును, ఆర్యశతకము వ్రాత ప్రతియు నాకుఁ జేరి చిరకాలమయినను వెంటనే సమాధానము వ్రాయ లేక పోయితిని. హైస్కూలు ఇన్స్పెక్షను, కార్యాంతర నిమగ్నతయు నిందులకుఁ గారణములు.

నేను మీ శతకమును ఆమూలము చూచితిని. కంద పద్యములను రచించుటలో మీ లేఖిని ఆరి తేరినదని నా యభిప్రాయము. పద్యములు కుంటువడని ధారా శుద్ధి గలిగి యే గణమునకా గణము విఱిగిన యలఁతి యలఁతి పదములతో విద్యార్థి లోకమునకు బఠన యోగ్యములయి యున్నవి. ఈ శతకమును ముద్రింపించు మీ పూనిక సార్థకమగును గాక! మిత్రుఁడు జొన్నలగడ్డ నారాయణశాస్త్రి, పార్థివ సం॥ సంక్రాంతి, (ఉభయ భాషా ప్రవీణ, బి. ఓ. యల్, విశారద)

---

నోబుల్ హైస్కూలు
మచిలీపట్టణము
30-11-1946

ఆర్యా!

మీరు పంపిన "అన్నశతకము" చేరి చాల దినము లైనది. కాని అప్పటి నుండియు సమాధానము వ్రాయఁ జాలనందులకు విచారము. పని యొత్తిడియే కారణము అన్యథా భావించ కుందురు గాక!

తమ గ్రంథము నచ్చుటచ్చుట చూచితిని. బాగు యున్నది. ధారళముంటు లేక సాఫమై యున్నది. శతక రచన నిది క్రొత్త శక్తి. కైత యభ్యున్నతి నొంద జాల య కాశములున్నవని నమ్ముచున్నాను.

ఇట్లే తమరనేక గ్రంథములను రచించి దేశగౌ మును, పండితాదరణము నందు దురని విశ్వసించు చున్నాను.

విద్వాన్, యడవల్లి ఆదినారాయణ

---

హైదరాబాదు,
13-1-1972

సంక్రాంతి పర్వదిన శుభాకాంక్షలు.

బహువిధ బిరుద భూషితులు శ్రీ కోగంటి దుర్గ మల్లికార్జునరాయకవిగారికి, ఉభయ కుశలోపరి.

మీరు పంపిన బ్రహ్మశ్రీ అభినవ పోతన మంగిపూడి వేంకటశర్మ గారి జీవిత చరిత్ర ప్రథమ భాగము అందినది మీకు కృతజ్ఞుడను. శ్రీ శర్మగారి జీవిత చరిత్ర ప్రథమ భాగము ప్రకటించి మీరు మా బోటి వాఙ్మయ చరిత్రకారుల కెంతో ఉపకారము గావించినారు. శ్రీ శర్మ గ్రంథములు "విశుద్ధ భాగవతము, భారతమాత శతకము, గా మహాత్మ్య శతకము" మొదలైనవి లభించు చోటు తెలుపుడు. నేను వ్రాసి తెప్పించుకొందును.

నిడుదవోలు వేంకటరావు, ఎం.

ముద్రణ : మధుసూదన ప్రెస్. గుడివాడ.